ఓం

# మరణదుఃఖ నివారణము.

లేఖకుడు

ఆర్య నారాయణమూర్తి,

హిందూపురము.






మంజువాణీ ముద్రాక్షరశాల,

ఏలూరు.

1922



# మరణదుఃఖ నివారణము.





లేఖకుఁడు

ఆర్య నారాయణమూర్తి,

హిందూపురము.

మంజువాణీ ముద్రాక్షరశాల,

ఏలూరు.

1922

# అంకితము.

సీ. ఏలలనామణి కోళాలసిద్దప్ప
హృదయహ్లాదమైన యేకపుత్రి
ఏరామ శ్రీమద్దులూరి పురస్థిత
సిద్ధగంగప్ప యోషిల్లలామ
ఏపవిత్రచరిత్ర ఋష్యంగనాబృంద
గేయసాధ్వీజన కీర్తిమాన్య
ఏమానవతి పరమేశ్వరసేవన
సంప్రాప్త కైలాస శైలసదన
గీ. అట్టి శ్రీమతి గంగమాంబాభిదాన
కమలగుణనిధి కీగ్రంథ మార్యులెన్న
సిద్ధగంగప్ప యానతిఁ జేసి విలయ
నంకిత మొనర్చె-

ఆర్య-నారాయణుఁడను.

# మరణ దుఃఖ నివారణము.

ఈవిషయమునందు మనము మొట్టమొదట సుఖదుఃఖములనుగురించి తెలిసికొనవలయును. లోకమందెవరికిగాని కేవల సుఖము అథవా దుఃఖము మాత్రమె ప్రాప్తించదు. దానిలోనిదియు, దీనిలో నదియు, మిశ్రమమైయుండును. దరిద్రుని కుటీరమందును మహారాజ భవనమందును సుఖదుఃఖములు రెండును చేరియుండును. అయితే యవస్థాభేదమువలన న్యూనాధికముగ గనుపించుచుండును. ఉదహారణముగ దారిద్ర్యదుఃఖమునకు సమానమేదియు లేదని దరిద్రుడనుకొనును. కాని వాని కుటీరమందు పరదుఃఖానుభవము, సహిష్ణుత, దయ, మమత, యిత్యాదిగుణములు రాజమందిరమునకంటె నధికముగ నుండును. ఎవరికి నెల్లప్పుడు నభావముయొక్కయనుభవముండదో వారు పరులదుఃఖమునకు సహాయపడుట కేవలమరుదు. ఎవరికోరికలు సంకల్పమాత్రమున పూర్ణమగుచుండునో వారు సహిష్ణులగుట నితాంతముగ నపూర్వము. ఎవరికి శాంతిధారవలన శీతలము గలుగదో వారికి దయ యసఁగ నెట్టిది? ఎవరు నిరంతరము సేవకులవలన సేవింపఁబడుచుండురో వారికి ప్రేమయొక్కడిది? చింతాశీలత పరదుఃఖానుభవము, సహిష్ణుత, దయ, మమత యిత్యాదిగుణములుండుట

వలననే మానవుఁడు దేవుఁడనఁబడుచున్నాడు. ఇవి దారిద్ర్య మందధికముగ నుండును. ఒకమహాత్ముఁడిట్లు చెప్పియున్నాడు. "నీవు నీకుఁ గావలసిన యావశ్యకములను తగ్గించుకొనుకొలఁది దేవునిసమీపముఁ జేరుచుందువు." గనుక దారిద్ర్య మందు దుఃఖము ననుభవించుట భ్రమప్రమాదమున వలయును. ఈ లాగున నన్ని దుఃఖములను గురించి వివేచన సేయుట మన కర్తవ్యమైయున్నది.

ప్రకృతిపైన ప్రభుత్వమును నడుపుటయే నిజమైన యాధ్యాత్మిక రాజ్యము. ఇది రాజులకును ధనికులకును లభింపదు. ఎందుకనఁగా:— రాజుయొక్క యావశ్యకములు మితిమీరినవి. ఏమహాత్ముఁడు యావశ్యకములను తగ్గించుకొని ప్రకృతియొక్క బంధనమునుండి విముక్తుఁడగునో యామహాత్ముఁడునిజమైన రాజనఁబడును. ఆర్యులీరాజత్వము యొక్క గౌరవమును చక్కగాదెలిసియుండిరి. ఆర్యతాపసు లిందునిమిత్తము సంసారములను త్యజించి పర్వతకందరములందు యోగసాధన తత్పరులై ప్రకృతియొక్క మోహబంధనమునుండి విముక్తులగుచుండిరి. వారియాత్మసంయమమునకుమోహితులై చక్రవర్తులును మహాపరాక్రమవంతులును, వారిపాదములకుఁ బ్రణమిల్లి తలలువాంచి సేవఁ జేయుచుండిరి.

మనుష్యుని ప్రతిస్థితి యందును సుఖదుఃఖములు మిశ్రమమైయుండుట యాతని భాగ్యముకానేరదు, గాన దుఃఖమును యనుభవించవలసిన యావశ్యకము లేదు; గనుకనే యావశ్యకములను తగ్గించుకొన వలయునని చెప్పఁబడుచున్నది. ఆవశ్యకత హెచ్చినకొల్ల దుఃఖమధిక మగుచుండును. దీనికి నిదర్శనములు ముందు తెలియజేయఁ బడును. ప్రకృతి యనునది మన జీవనమార్గమందు కంటక రూపముగ నుండ కుండ బలపూర్వకముగా నాటంక పెట్టుట మహాత్ముల పద్ధతియై యుండినది. కంటకముచేత కంటకమును దీయుట సామాన్య జనపద్ధతియై యున్నది. దీనికి నుదాహరణములు మన ప్రాచీనులయొక్కయు, నిప్పటి యాధునికులయొక్కయు పద్ధతులు మనకు గోచరము లగుచున్నవి. మొదటిది ప్రకృతి స్వాధీనత యనియు రెండవది ప్రకృతి సాపేక్షయనియుఁ దెలియుచున్నది. ఏసుఖము స్వాధీనమైనదో యది ప్రార్థనీయము. ఏసుఖము వంచితమో యది దుఃఖపరిణామము. దరిద్రుని సాధనము బహుఘోరమయినది. వాఁడు ప్రతి సమయమందును విపత్తుల నెదిరించవలసివచ్చును, గాన వాడవశ్యము సహిష్ణుఁడగుచున్నాడు. దరిద్రుని పాలిటికి సన్న్యాస మితమే గావున యావశ్యకములను సంకుచితము చేసికొనుమని యది బోధించుచున్నది. దరిద్రునికిని సన్న్యాసికిని యింతమాత్రము భేదముకలదు.

సన్న్యాసి తానే, దరిద్రస్థితిని పొందినవాఁడు. దరిద్రుఁడుదైవ నియమమును పొందిన వాఁడు. స్వేచ్ఛయు ననిచ్ఛయు వీరికి భేదములు. దరిద్రుఁడు యిచ్ఛలేని సన్న్యాసి. ఉపదేశములేని యోగి, వీఁడు యాహారాది పదార్థములకు కుక్కవలె పరుల నాశ్రయించక యాచింపక యథాలాభ సంతృప్తిఁగలిగి యుండును గనుక దుఃఖ మనుభవించు చున్నాఁడు. సన్న్యాసి దుఃఖ మునాదరించును. భోగవాసనలనుత్యజించి విరాగుఁడగును. ఒకఁడు పరులపై కోపపడుటకు బదులు తనకోపముపై తాను కోపపడిన యెడల శాంతిచేకూరినట్లు దుఃఖమును నిందించుటకు బదులుగ నాదరించినయెడల సుఖము లభించును.

వైశేషిక శాస్త్ర కర్తయగు కణాదఋషియొక్క దారిద్ర్యావస్థనువిని మహారాజు, ఋషియొద్దకు నానాపదార్థములు బంపగా, నివి నాకెందులకు? బీదవాని కెవనికైన యిచ్చివేయుఁడని చెప్పెను. ఈవార్త విని రాజువెడలి ఋషికి నమస్కరించి పదార్థములు స్వీకరించుటకుఁ బ్రార్థించెను. ఋషి యథాప్రకారమొక బీదవాని కిచ్చివేయుమని బదులుచెప్పెను. అందుకు మహారాజు కణాదఋషితో "తమకంటెను దరిద్రుఁ డెవరో చూపుఁడని" యడిగెను. లోకములో సాధారణముగా ధనికులను దరిద్రు లాశ్రి

యించుట సత్యముగదా? యని మహర్షి ప్రశ్నించెను. రాజు నిజ మనెను. ఇప్పుడు నా యాశ్రమమునకు మీరు వచ్చి నన్నాశ్రయించి ప్రార్థించుచున్నారు గాని నేను మీ వద్దకు వచ్చి మిమ్ముల నాశ్రయించి యుండలేదు. మనలో నెవరు దరిద్రులని ఋషి యడిగెను. రాజు తానేయని యంగీకరింపవలసి వచ్చెను. కనుక మీరే యీ పదార్థములను పుచ్చుకొనవలయునని రాజునకు చెప్పెను. ప్రాచీన కాలమం దిట్టివారినే బ్రాహ్మణులని పిలుచుచుండిరి. వారి యం దిది ముఖ్యలక్షణము. వారు త్యాగశ్రేష్ఠులై వనములం దుత్పన్నములైన ఫల మూల శాకాదులచేతనే వారి జీవనమును నిర్వహించుకొనుచుండిరి. వారియొక్క విశ్వప్రేమ భావము క్రూరజంతువులందు సయితము ప్రతిబింబితమగుచుండినది. దుఃఖముయొక్క సత్యమును తెలియక దానిని ద్వేషించి ప్రయోజన మేమి?

దుఃఖ మనంత సామర్థ్యముగల నియమము. అది మానవునకు మంచి యుపదేశకుఁడు. దానినుండి సదుపదేశమును స్వీకరింపవలయును. దుఃఖము హృదయమందు స్థిరనివాసముచేయుటకు మూర్ఖముతో గూడిన యసంతృప్తియే ప్రధానకారణమని జ్ఞాపక ముంచుకొనవలయును. సుఖ దుః

ఖములు పైకి వేరువేరుగా నున్నవి. లోపల సుఖ రూపమున్న బైట సుఖమున్నది. దుఃఖరూపమున్న దుఃఖమున్నది, గనుక ధన దరిద్రము లందుకు మూలములుగానేరవు. ఒక కోటీశ్వరుఁడు దరిద్రునికంటెను దీనుఁడై ప్రలాపించుటయు నొక నిరుపేద సదా యానందముననుండుటయు జూచుచున్నారము. అజ్ఞానముచేతను, తారుణ్యమదముచేతను, సుఖోపభోగము లందు సుఖమున్నదని భ్రమించుచున్నవాఁడు. అది నిజమైనచో దానియందెన్నడును మానవున కసహ్యము గలుగరాదు. ఆనందమని భావించిన సుఖభోగములందే దుఃఖముత్పత్తియగుచున్నది. ఆరోగ్యహేతువులగు నాహారాదులే యనారోగ్య హేతువు లగుచున్నవి. కనుక సుఖ దుఃఖముల రెంటికిని మాతృస్థాన మొక్కటియగు మన్నది.

పతంజలి యోగదర్శనమందు “ అనిత్యాశుచి దుఃఖానాత్మసు, నిత్యశుచిసుఖాత్మాఖ్యాతిరవిద్యా ” యని చెప్పియున్నారు. అనిత్యమును నిత్యమని, అశుచిని శుచియని, దుఃఖమును సుఖమని, అనాత్మనే యాత్మయని తెలియుట యవిద్య యనఁబడుచున్నది, “ సర్వం పరవశం దుఃఖం సర్వమాత్మవశంసుఖం ” బనునట్లు స్వతంత్రవిహీనమునకు దుఃఖమని పేరు. ఒకఁడు తన యిష్టమువచ్చినప్పుడు బైటకుబోయి

వచ్చుటకు స్వతంత్రము గలవాఁడైనప్పుడు తన యింటియం దుండుట సుఖ మనుకొనును గాని దుఃఖముగా దలంపడు. అయితే పరు లెవరైన వానిని యిల్లువిడిచి బైటకురాకూడదని యాటంకము చేసినప్పుడు యింటియందుండుట దుఃఖముగా తలంచును. ఉండుటకు సుఖప్రదమైన గృహమే దుఃఖకారణ మాయెను. కారాగృహమందలి నేరస్థులు దుఃఖమనుభవించు చున్నారు, గాని, కారాగార నిరీక్షకులగు నౌకరులు కారా గారములందే సుఖముగనుందురు. ఒకనికి భోజనపదార్థములు సిద్ధముగ నున్నప్పుడు, వాని కాకలివలన దుఃఖము గలుగదు. ఎవనియొద్ద భోజనపదార్థములు లేకయుండునో, వాడాకలికి దుఃఖపడును. ఇందువలన నావశ్యకమును పూర్తిచేయుటకు సమర్థుఁడు గాకపోవుటయు, పారవశ్యమును, దుఃఖమని విశద మగు చున్నది. ఇట్లుండగా నావశ్యకతను యధికము చేసి కొనుట సుఖమని లోకులు భ్రమించియున్నారు.

ఒక కృషికుఁడు తన పొలములో గులకరాళ్ళపై పరుం డి గాఢముగ నిద్రపోవుచుండును. వాడే కొంతకాలమునకు ధనాఢ్యుఁడైనచో హంసతూలికాతల్పమునందు సుఖనిద్ర లేనివాడై పొరలుచుండును. జీర్ణశక్తి మందగించును. రోగ ములు బాధించును. అయినను వాఁడుపరులతో తన పూర్వ

దశను చెప్పుకొనుచు బహుదుఃఖ మనుభవించితి నని భావించును. ఈలాగున మానవుఁ డవిద్యావంతుఁడై మనస్సు యొక్క విస్తారవృత్తిని సుఖముగను యేకవృత్తిని దుఃఖముగను తెలియుచు భ్రమించుచున్నాఁడు.

గానము మనకానందదాయకమై సుఖముగానుండును. అది యొక కొంతసేపటికి నిద్రాభంగకరమై దుఃఖదాయక మగును. లోకములో ననేకులు కష్టములవలన మాన గౌరవ ప్రతిష్ఠలను పొందియున్నారు. దుఃఖనివృత్తికి దాని వివేచనము సాధనమై యున్నది. "నేను దుఃఖాత్ముఁడను" అని యను కొనువాఁడు దుఃఖమెక్కడినుండి వచ్చి తనలో దూరియున్న దని వివేచనచేయవలెను. అది సంస్కారజనితమైనదని బోధ యగునంతవరకు మాత్ర ముండును. మనలోని సుఖానంద భాండాగారము మనకు లభించువరకు జగత్తులోని క్లేశములు మనకొరకు నిర్మింపఁబడినవని భ్రమించుచున్నారము. వానిని పాశములుగఁ జేసి బంధించుకొనుచున్నాము. మూర్ఖము, నజ్ఞానము, యదార్థజ్ఞానశూన్యత మొదలగు దుర్గుణములతో మన మెంతకాలముఁ గూడియుండెదమో, అంతకాలము మన కవశ్యము దుఃఖానుభవము సంభవించుచుండును. మనుష్యు డు దుఃఖమునుండి సదుపదేశమును స్వీకరింపక నున్నాఁడు,

గనుక నది వానిపై యాచ్ఛాదన మగుచున్నది. దానినుండి దూరము చేయుమని దేవుని ప్రార్థించుటవలన నది తొలఁగి పోజాలదు. ప్రతిదుఃఖముయొక్క ప్రయోజనమును సంశోధించుటవలనను సుధారించుట వలనను దాని వలన గలుగు ననిష్టము దూరమగుచుండును.

సుఖసాధన మిది యని తెలిసినంత మాత్రమున సుఖానందము ప్రాప్తింపదు. సాధనముద్వారా సాధ్యమును పొందవలయును. వృద్ధావస్థయందు మేలు గోరువాఁడు తన యవ్వనదినములను వెచ్చపెట్టవలయును. విచారము జేయని వానికి జ్ఞానము లభింపదు. అట్టివాఁడు తప్పక దుర్గతిపాలగును.

ఆపద ననుభవించుటవలన ధైర్యము ద్విగుణ మగుచుండుట లోకానుభవము. సామాన్యముగ క్లేశములు మనుష్యునకు నొక విధమైన జీవన యవస్థలుగా నున్నవి. జ్ఞానియగువాఁడు వానినుండి బలప్రాప్తిని సంపాదించు కొనుచున్నాడు. మూర్ఖుఁడు భయభీతుఁడగుచున్నాడు. మనమొక వృద్ధావస్థ యనెడు ఘోరారణ్యముఁ జేరవలసి యున్నది. ఆ యడవియొక్క నీడ మనపైఁ బడినతోడనే మన యింద్రియములు శిథిలము లగుచున్నవి. అప్పుడు సర్వదా యంధకారమై మన

కన్నులు చూడఁజాలక నుండును. సర్వాంశము లందును మన మసమర్థులమై యుందుము. మన పరితాపములు పటాపంచ లగును. అట్టి స్థితిలో మనపై నొక క్రూరమగు మృత్యు వాక్రమణము చేయగలదు. ఆబాధను జయించి మృత్యు విజయమును సంపాదింప వలయునన్న నిప్పుడే ప్రయత్నముఁ జేయవలయును.

పరమేశ్వరుఁడు సుఖస్వరూపుఁడు. మనము సుఖమును గోరుచున్నాము. ఆనంద మెవనియొద్ద నున్నదో వాని లక్షణము మనము తెలిసికొని వానికి ప్రీతిగ మనము వ్యవహరించిన చో నది లభింపగలదు. మన కాకలి యైనప్పుడు యాహార పదార్థములు గలవానిని ప్రార్థించగా నాతఁడు మన కియ్యగలఁడు. అలాగుననే సుఖమునకు కేంద్ర స్థానమగు పరమాత్మను మనము భక్తిప్రార్థనో పాసనముల ద్వారమున వేఁడు కొనవలయును. ఇంక దుఃఖ ప్రతీతిని గలుగజేయు మృత్యువును గురించి విచారింతము.

## మృత్యుభయము.

ప్రపంచమున మరణమునకు భయపడని ప్రాణిలేదని యందరికిఁ దెలిసిన యంశమె. జ్ఞానికి, నజ్ఞానికి, పెద్దలకు,

చిన్నలకు, శ్రీమంతునకు, దరిద్రునకు, మనుష్యేతరములగు జీవుల కన్నింటికిని మరణ భయము గలదు. ఇదెట్లు సంభవించెను? ఇది పూర్వ జన్మము యొక్క సంస్కారము. దానిపేరణము. ఈభయమును నివారించుటకు పురుషార్థ మావశ్యకమని యీయనుభవము విదితము చేయుచున్నది. ప్రతిప్రాణికిని మరణము నితాంతముగ నపరిహార్యమై యున్నది, గాని దాని బాధను మాత్రము పురుషార్థపరుఁడు నివారించు కొనగలఁడు. మృత్యువు మాత్ర మెవరికిని తప్పదు. ఒక స్థలమందు మృత్యువు సంభవించక నున్నచో మరియొక స్థలమందు జన్మము సంభవింపదు. నీవు పుత్రజన్మమున కానందముఁగోరితివేని దాని కొరకు మరియొకని మరణమును స్వీకరింప వలయును. ఒక స్థానమందొకఁడు మరణము నొంది మరియొక స్థానమందు జన్మించ వలయును. ఇందువలననే తత్వవేత్తలు సుఖదుఃఖములను సమానములుగ భావింపవలెన నెదరు. జనన మరణములు రెండును సాపేక్షము లైనవి.

## మరణస్వరూపము.

మనకుగల యీ బాహ్యశరీరము పూర్వ మొకజీవికి శరీరమైయుండినది. మరణానంతర మిది వేరొకజీవికి శరీరము కాగలదు. కనుక జ్ఞానులు దీనియం దభిమాన ముంచరు.

ఈ స్థూలశరీరమునకు లోపల మూడు సూక్ష్మశరీరములు గలవు. వానికి క్రమముగా సూక్ష్మశరీరము, కారణశరీరము, మహాకారణశరీరము లని పేరు. స్థూలము పంచమహాభూతాత్మకమైన యన్నమయకోశముతోడను, సూక్ష్మము వాయుతన్మాత్రికమైన ప్రాణమయకోశము తోడను, కారణశరీరము మనో బుద్ధి చిత్తా హంకార తత్త్వాత్మకమైన మనోమయకోశముతోడను, మహాకారణదేహము మూలప్రకృతి మహాతత్త్వాత్మకమైన విజ్ఞానానందమయ కోశముతోడను, సంబంధమై యుండును. ఈ సంబంధము జాగ్రత-స్వప్న-సుషుప్తి-మరణావస్థలయందు మార్పు జెందుచుండును. స్వప్నావస్థయందు స్థూలశరీరము శిథిలమై పడియుండును. దీనితో ప్రాణసంబంధముండును గాని మనోమయసంబంధమునుండి దూరమగును. బాత్తిగమాత్రము సంబంధము తప్పిపోదు. కనుక, స్వప్నములు గలుగుచుండును. సుషుప్తియవస్థయందు మనోకోశము లీనమైపోవును. తత్త్వములన్నియు నానందమయ కోశములో విశ్రమించును. ఈ యవస్థలో సుఖ దుఃఖానుభవ హేతువులగు కోశములన్నియు నానందమయకోశములో లీనమై, విశ్రాంతినొందును. కాన, సుషుప్తిలో సుఖ దుఃఖములు రెండును ప్రతీతి కానేరవు. మరణావస్థయందు అన్నమయ ప్రాణమయ కోశముల సంబంధము పూర్తిగా

తెగిపోవును. ఈ స్థితులను బోధించుటకై క్రింది కోష్టకములు చూపబడుచున్నవి. ఈ నాలుగు కోష్టకములను పరీక్షించుచు వాని విషయమై యుపర్యుక్తవివరములను చక్కఁగా బోధపడువరకు పలుమారు చూడవలయును.

## 1



**2**



3













సుషుప్త్యవస్థా




అన్నమయకోశాత్మకమగు
స్థూలశరీరము.

[redacted]

మరణము కొంతకాలమునకు సంభవించు ననగా, కొలదిసమయమునకు మునుపు నొక మనస్సంకల్పము కలుగు చుండును. ప్రతి కార్యమునకును మొదట సంకల్పము కలిగి తీరవలయును. సంకల్పము తరువాత జీవితానుభవ దర్శనము ప్రత్యక్షమగును. అప్పుడే మరణభీతియు, దుఃఖమును ప్రతీతి యగును. ఈ గుప్తమగు చిత్రముల ప్రత్యక్షమును, చిత్ర గుప్తుఁడని, భయాదులను యమదూతలని, కాలమునకు యముడని, వైదిక గ్రంథములను పఠించినవారికి తెలియును. వానిని పఠింపనివారు యీసందర్భమునందు తత్త్వ జ్ఞానము మొదలగు గ్రంథములు పఠించితీరవలయును.

ఇప్పుడు సాధారణముగ మనకు జాగ్రదవస్థలో కొంత భాగమును సుషుప్తియవస్థలో కొంతభాగమును చేరి స్వప్నా వస్థ కలుగును. మరణసమయమం దిట్లు సంభవింపదు. మృత్యువు సమీపించినప్పుడు కలిగెడు స్వప్నావస్థ మిక్కిలి భయం కరమై యుండును. భావికాలమున గలుగబోవు ఫలము ప్రత్యక్షమగును. ఈ భయము ధర్మసహాయమున ధర్మాత్ములకు దూరమగుచుండును. తత్త్వవేత్తలకు ప్రతీతియోగాక కేవలస్వప్నా వస్థగా నుండును. జ్ఞానులగు యోగులకు నీయవస్థలు నితాంత ముగనుండక సుషుప్తియవస్థలో ప్రవేశమై మరణముసిద్ధించును.

ధార్మికాది నియమములయొక్క మూలహేతువులు స్థూల సూక్ష్మ కారణ దేహములను శుద్ధముగాను, పవిత్రముగాను, బలిష్ఠములుగాను, చేయగలవు. సాధారణ మనుష్యులయొక్క సూక్ష్మ కారణ దేహములు పరిశుద్ధములు గానేరవు. స్థూలదేహ మారోగ్యబలములతో గూడియున్నను, సూక్ష్మదేహములు వికాసవంతములును, యిచ్ఛాశక్తిప్రాబల్యములును, గానేరవు. ఈ విషయ మాత్మబలమును గురించిన వ్యాసమున విస్తారముగ వ్రాయఁబడి యున్నది.

జీవాత్మ శరీరమునుండి వియోగమగుటకు మరణ మని పేరు. అట్టి వియోగసమయమందు నేవిధమైన క్లేశానుభవము లేకుండ సుఖానందములతో వెడలిపోవుటకు మృత్యువిజయ మని పేరు. మంచివానికి మరణమేసాక్షి యను సామెతలో నీ రహస్యముగలదు. జీవుఁడు దేహవియోగముఁ బొందునప్పుడు దుఃఖ మెందుకు ప్రతీతమగుచున్నదని, యడిగినచో, సంయోగము స్వాభావికము గనుక వియోగమందు బాధ గలుగుటయు స్వాభావిక మని బదులు చెప్పుచున్నారు. మృత్యువు మనలను దినదినము చంపుచునే యున్నది. ఒక్కొక్క క్షణము మొదలుకొని పగలు రాత్రి, యిత్యాదిగ, కాలము వ్యతీతమయినట్లెల్ల మనము మృత్యువునకు సమీపించుచు

పోవుచున్నారము. కనుక నీ వియోగము సర్వదా జరుగుచునే యున్నది, గాని మరణదుఃఖము ప్రతీతికానేరదు. ఎందుకన, ప్రాణకోశము శరీరమునుండి వేఱుపడదు. ఆర్షగ్రంథములందు ‹‹ ఆత్మానం రథినం విద్ధి శరీరం రథమేవతు। బుద్ధింతు సారథిం విద్ధి మనఃప్రగ్రహమేవచ ” అనఁగా జీవాత్మ రథమందు గూర్చుండియుండిన యజమానుఁడనియు, దేహము రథమని యుఁ జెప్పఁబడియున్నది. ఒక బండియందు గూర్చుండి యాత్రచేయువాని కెటువంటి దశయందు బండిని విడుచుటలో బాధ సంభవించునో మన మిప్పుడు వివేచన చేయవలసి యున్నది. ప్రయాణముచేయు వానికి బండియందుగల ప్రేమ స్వాభావికమైనది కాదు. అది ప్రయోజనసిద్ధికై కలిగినది. రథస్థుఁడు రథముద్వారా సుఖానందపూర్వకముగ తన నియమితస్థానముఁ జేరుటకై వెళ్లుచు దారిలో బండికి సంభవించిన లోపములను చక్కపరచుకొనుచుండును. తన ప్రయాణము సంపూర్ణమగువరకును రథముపై ధ్యానముంచి, నియతస్థానము జేరిన తరువాత యాత్రికుఁడు స్వయముగా బండిని త్యజించుచున్నాఁడు. మఱియు బండి కేవలము శిథిలమై ప్రయాణమునకు యోగ్యముకానప్పుడును, దానికంటె నుత్తమమైన బండి లభించునప్పుడును, తాను గూర్చుండియుండిన దానిని త్యజించుట సంభవించును. అయితే మొదటిదానికంటె నుత్తమ

మైన బండి లభ్యముకాదని తెలిసినప్పుడు దానిని విడిచి పెట్టుట మిక్కిలి దుఃఖముగా నుండును.

మనము రైలు బండిలో గూర్చుండి వెళ్లుచు గమ్య స్థానముఁ జేరక మునుపే మధ్య మార్గమున బండిని విడువ వల యు నన్న నెంతయో కష్టముగా నుండును. అలాగుననే మన యుద్దేశములు నెరవేరకమునుపు మన స్థితిని మార్చుకొనుట కు క్లేశ దాయకముగ నుండును. మనము చేరవలసిన స్థల మును జేరినామని తెలిసిన తక్షణమే బండిని దిగుటకు సిద్ధము గుదుము. బండి తలుపుఁ దీయుటలో నాలస్యము జరిగిన యె డల కావలి మనుష్యుని కూత వేసిపిలుచు చున్నారము. వా డు వచ్చి ద్వారము తీయు వరకు చిత్తశాంతి యుండదు. వాఁ డు రాకున్న వేరొక ద్వారము నుండి వెళ్లుటకు ప్రయత్నముఁ జే యుదుము. ఇదే విధమున నీశ్వరుఁడు మన కెందు నిమిత్త మీ శరీరము నిచ్చియున్నవాఁడో దానిని ధర్మ మార్గమున సంపూ ర్తి చేయక కాలమును జీవితమును వ్యర్థపుచ్చినచో మన మీ దేహ వియోగ సమయమందెక్కువ దుఃఖమను భవింతుము. మన కర్తవ్యము లేమని సజ్జనుల సాంగత్యము వలన దెలిసి కొని వానిని పూర్తిగ నివర్తించితిమేని, మన మీశ్వర భక్తు లమై మరణ దుఃఖమును జయింప గలము. సుఖానందములతో

దేహమును త్యజింప గలుగుదుము. మనకుకించిత్తయినను మృత్యుభయముండ నేరదు.

మనుష్యశరీరము కర్తవ్య భోక్తవ్యముల రెంటితోగూడిన మిశ్రమయోనియై యున్నది. కర్తవ్యకర్మవిషయమందీ శరీరము సంసారసాగరమును దాటుటకు జలయానమై యున్నది. జీవాత్మ యీ శరీరరూపమగు నోడయందుఁ గూర్చుండి లోకసముద్రమును దాటువరకును దీనిని భద్రముగఁ జూచుకొనవలసియున్నది. సముద్రమధ్యమున నౌకనుండి దిగవలసి వచ్చినచో నది మిగుల భయంకరమగు స్థితిగానుండును నౌక జలమధ్యమందుండునప్పుడు తుపానువలన నోడకు సపాయము సంభవించునని దోచెనేని నౌకలోనుండువానికి నధిక పరితాపముఁ గలుగును. సాధాంశ మేమన, నెవఁడు తన విధులను నెరవేర్చినందున జన్మసాఫల్యత గనునో వాఁడు మృత్యువునకు భయపడఁడు. ఎవనికి యీజన్మమందు సాఫల్యత ప్రాప్తింపదో వాఁడు మరణభీతిని యనుభవించును. ఏ జీవాత్మ యథార్థమగు నీశ్వరీయ జ్ఞానప్రాప్తినిఁ బొంది తన్ను ముక్తికి యధికారిగఁ జేసికొనునో యట్టి జీవాత్మ మృత్యువునకొంతమాత్రమును జడియదు. ఏ జీవుఁడు తన జీవనమును పాపసముద్రమున ముంచివేసి వ్యర్థముఁజేయుచున్నాడో వాఁ

డు తప్పక మరణవేదనము ననుభవించుచున్నాడు. మృత్యువునకు మృత్యువగువాఁడు మృత్యుంజయుఁడని మహాత్ములు చెప్పుచున్నారు.

ఆవశ్యకములను తగ్గించుకొనుట మరణదుఃఖ నివారణమునకు రెండవసాధనము. ఉదాహరణముగ నొకమందిర మందొకభాగములో నొకఁడు బాడుగయిచ్చికాపురమున్నాడు. గృహయజమానివేరొకభాగమందున్నాడు. ప్రభువులొకకారణముచేత నిద్దరిని రెండుగంటలలో నాయింటినివిడిచి వెళ్లుమనియాజ్ఞాపించుచున్నారు. అప్పుడాయిద్దరిలో నెవరికి దుఃఖమధికముగానుండును? బాడుగకున్నవాడుచింతించుటకవకాశముండదు. వానికేమియుదుఃఖముండదు. వాడుఇల్లుతనది కాదనియు బాడుగకు కాపురమున్నవాడననియు తెలిసికొనియున్నాడు. గృహయజమాని, స్థానము తనదనియు, కష్టపడికట్టించితిననియు, దీని నెట్లువిడువవలెననియు నెక్కువదుఃఖమనుభవించును. ఇద్దరొకసత్రమున దిగియున్నారు. అందొకనియొద్ద సామగ్రియు సంపదయు నధికముగ గలదు. మఱియొకఁడు సన్న్యాసిగనుక కౌపీనసాధువుగనున్నాడు. వీరిద్దరిని తక్షణమేసత్రమును విడువవలయునని రాజాజ్ఞయైనచో దుఃఖమెవరికధికమగును? సామానులధికముగ సేకరించిన వానికధికదుఃఖముగలుగును. సాధువు

నిరాయాసముగ వెడలిపోవును. ఈదృష్టాంతములనెల్ల చర్చిం చితిమేని జీవాత్మలకు మృత్యుబాధానుభవము నాల్గువిధ ము లగును.

(1) ఎవడు యధార్థమగు తన జీవనోద్దేశమును మఱచి ధనార్జనమందే మగ్నుఁడై తనయాయువును గడుపుచున్నాడో వాడును, (2) ఎవఁడు తనవిషయ భోగములను తృప్తిఁజేయుట యందే జీవితమును ధారఁబోసి మరణానంతర ముత్తమ జన్మము లభ్యము కానంతటి మలినాత్ముఁడగునో యట్టివాఁడను (3) ఎవఁడీ శరీరమును కొన్నాళ్ల కొరకీయఁబడిన ప్రాకృతిక మని తెలియ జాలకను, దీనికి ప్రతి దినము నాహార రూపమగు బాడుగ నియ్యవలసి యున్నదని తెలియకను, యీశరీరమే తానని అథవా యీశరీరము తనదని నమ్మికొని యుండునో వాడును, (4) ఎవఁడు లౌకిక పదార్థముల నధికముగ జేర్చి వానిపై ప్రేమాధిక్యము వలన వానినే ధ్యానించుచుండునో వాఁడును, మరణ దుఃఖ మత్యంత మనుభవింప వలసి వచ్చును. అలాగే నాలుగు విధములగు మనుష్యులు మృత్యువునకు స్వాగత మిచ్చి సుఖ మనుభ వింతురు. (1) ఏమహాత్ముఁడు పెద్దల వలన నీశ్వరాజ్ఞాది విధుల నెఱింగి, నియమానుకూలముగ తన కర్తవ్యముల నాచరించి, జ్ఞానియై మోక్షా

ధికారియగునో యాతండును, (2) ఏపుణ్యాత్ముఁడు సదాధర్మ తత్పరుఁడై తన జీవితమును పరోపకారమునకై ధారఁబోయు చుండునో యట్టి ధీరుండును, (3) ఏసాధువు తన శరీరము యొక్క తత్వము నెఱింగి యిది ప్రాకృతిక వికారమని నిశ్చ యించి, తన యాత్మీయ యుద్దేశములందే దృష్టినిలిపి వానినిఁ జేరుటకిది యొక బాడుగబండియని గ్రహించి యుండునో యట్టి తత్వవేత్తయు, (4) ఏపండితుఁడు వేదాది సత్యశాస్త్ర ముల వలన నిశ్చయజ్ఞానముఁగలిగి వైరాగ్యముచే విరాజిల్లు చు, నీశ్వరధ్యాన తత్పరుఁడై యుండునో యట్టి విద్వాంసుఁడ గు యోగియు నణుమాత్రమైనను మృత్యు సమయమందు దుఃఖము ననుభవించక దాని భీతిని బాధను స్మరించక సుఖా నందమగ్నుఁడై యుండును.

ఉపర్యుక్త నియమములు సర్వసాధారణ మానవాత్మ లయొక్క యున్నతికి సంబంధమై యున్నవిగాని, మతమతాం తర సాంప్రదాయములకు సంబంధించినవి గావని మనము జ్ఞాపకముంచుకొనవలయును. మతాంతర ప్రచారకులీ ధర్మపా లనమునకు చోటివ్వరు. గీతలో జ్ఞానియొక్క మరణావస్థను గురించి “వాసాంసిజీర్ణానియథా విహాయ నవాని గృహ్ణాతి నరోపరాణి । తథా శరీరాణి విహాయజీర్ణాన్యన్యానిసంయాతిన

వానిదేహీ " యని చెప్పఁబడినది. మనము గృహమునుండి బైటకు పోవునపుడు ననేక వస్త్రములు ధరించి వెళ్లుచున్నారము. మరల నింటికివచ్చి తీసివేయుచున్నారము. మహాత్ములగు జ్ఞానులకు వస్త్రములు తీసివేయుట వలెనే మృత్యువు ప్రతీతమగుచుండును. అనేక మతమతాంతరులు గీతను ప్రతిదినము పారాయణముఁ జేయుచున్నారు, గాని యెందరీ తత్త్వము ననుసరించిరి. " శునిచైవశ్వపాకేచ పండితాస్సమదర్శనః " యని పఠించు పండితు లెందరు గీతావాక్యమును పాలించుచున్నారు? గనుక మతమతాంతర మూర్ఖబంధనములను నిరసించువాఁడే యుపరోక్తమగు నభ్యుదయ మోక్షమార్గమున, పాదము నుంచగలఁడు.

మన కొక యిల్లున్నది. ఇల్లు పడిపోయినను మనము సజీవులమై యుండుటలేదా? కారణమేమి? మనము వేఱు; మన గృహము వేఱు. మనము మన యిండ్లకు నితాంతముగ భిన్నులమై యున్నాము. జ్ఞానియగువాఁడు తన జీవాత్మను తన శరీరమునకంటె భిన్నమని సర్వదా స్వానుభవముగలవాఁడై యుండును. ఇట్టి యనుభవము సదా, సర్వావస్థలయందును మఱువకనుండు యనుభవమునకే, యమరత్వమని పేరు. అమరత్వముయొక్క స్మరణగలవాఁడు, పవిత్రమగు కర్మలకు

నాత్మార్పణముఁజేయుచున్నాఁడు. ఇతఁడే మత్యువునకు మృత్యు వగుచున్నాఁడు. అనఁగా మృత్యువునకు స్వాధీనుఁడుగాక మృత్యువును తన స్వాధీనమందుంచుకొనుచున్నాఁడు. “ వివస్వాన్ నో అమృతత్వే దధాతు । పరైతు మృత్యు రమృతం నవతు ” (అ) అను వేదమంత్రమం దిదేభావము గలదు.

జీవాత్మ మన దేహములోపలి, యాంతరిక తత్త్వము. మానసాది తత్త్వములన్నియు బైటనున్నవి. లోపలచెడిపోయి నయెడల బాహ్యమందును చెడిపోవును. కనుక లోపలి పదార్థమందు నెక్కువ ధ్యానముంచవలయును. మత మతాంతరులు బాహ్యతత్త్వములందు విశేషధ్యాన ముంచెదరు గాని లోపలి ముఖపదార్థములపై ధ్యానముంచరు. ఒకఁడొక గుఱ్ఱపుబండిని దూరమునుండి చూచి బండిని గుఱ్ఱము నడిపించుచున్న దనుకొనును. బండి సమీపింపగా చూచి గుఱ్ఱమును, కళ్ళెమునడిపించునని తెలిసికొనును. తరువాత సారథిని జూచి వీడే బండిని తన యిష్టానుసారముగ నడపించునని తలంచును. కడపట బండిలోపల గూర్చుండి యుండిన యజమానునిఁ జూచి యీపనియంతయు నాతని యిష్టము ననుసరించి జరుగుచున్నదని నిశ్చయించును. అలాగుననే, కేవల మజ్ఞాని మొదట దేహమే తాననుకొనును. క్రమక్రమముగ తత్వమెఱుంగును, గాని జ్ఞానమనునది తెలిసికొనుట-విశ్వసించుట-

యాచరించుట, యను మూడంగములతో ఫలించునని మా త్రము తెలియజాలడు. తెలివియు, విశ్వాసము, జ్ఞానము, నాచరణమున కంగములగును గాని ఫలప్రదానములుగానేరవు. ఒకని జీవితముయొక్క సఫల విఫలములు వాని కర్తవ్య కర్మల ననుసరించియుండును. ఒక వనపాలకుఁడు తన వనము లోని, ఫల పుష్ప పత్రయుక్తమై పరోపకారయోగ్యమై సార సమన్వితమైయుండు వృక్షములకు నీరుపోసి పెంచుచుండును. ఎండిపోయి వ్యర్థమగు స్థితికి వచ్చినప్పుడు, యా వృక్షమును నరికివేయుచుండును. ఈలాగుననే మనము భగవద్దత్తములగు శక్తులను వ్యర్థముచేసినప్పుడు, మన జీవితములును, వాని సత్ఫ లములును, వినాశనమగుచుండును. మానవజీవన ప్రయోగ విధానమెఱుంగుటకే విజ్ఞానమని పేరు. అట్టిప్రయోగమును స్వ శక్తులచేత సఫలముఁ జేయువాఁడు మృత్యు విజయమును పొందగలడు.

మనమొక దూరదేశమునకు ప్రయాణముచేయవలసి వ చ్చినప్పుడావశ్యకపదార్థములను మాత్రము సేకరించెదముగాని యనావశ్యకములగువాని సంపాదింపము. ఉన్నచోనట్టి వస్తువు లను పారవేయుదుము. ఈలోకమువిడిచి పరలోకప్రయాణముచే యవలసినకాలము మనకు సమీపింపనున్నది. దానికిఁ గావలసిన

పరికరములేవి? ఛాందోగ్యమునందు "అస్యసోమ్యపురుషస్య ప్రియతో వాజ్ మనసి సంపద్యతే మనఃప్రాణే ప్రాణస్తేజసి తేజః పరస్యాం దేవతాయామ్" మృత్యువు సంభవించినప్పుడు వాగింద్రియము మనస్సునందును మనస్సు ప్రాణమునందును ప్రాణము తేజమందును తేజము ఆత్మయందును లీనమగునని చెప్పఁబడియున్నది. ఇట్టిపరలోకప్రయాణమునకు మనకు కావలసినదేదియని వివేచనచేసినచో, మనము తత్త్వమెఱుంగగలము. గుఱ్ఱపు సేవకుఁడు దానికి మేతవేసి నీరుఁబెట్టి యొడలు తిక్కి (మాలీషుచేసి) దాని సేవచేయుచున్నాడు కాని, గుఱ్ఱమువలన పనితీసికొనుట కధికారి కాజాలఁడు. దాని యజమానుఁడు దానిపైఁగూర్చుండి కళతో గొట్టుచు స్వాధీనముచేసి గమ్యస్థానమునకుఁ బోవును. ఈలాగుననే యవిద్యాన్వితుఁడగువాఁడు, అశ్వరూపమగు నీశరీరమునకు మంచి తిండివేసి పోషించుచున్నాడుగాని, దానివలన నేమికార్యమును ముఖ్యముగ చేయించవలయునో యట్టి సత్కర్మాచరణము నొసర్పక వ్యర్థుఁ డగుచున్నాడు. ముముక్షువు యీ శరీరరూపమగు అశ్వమును శిక్షించుచు కర్తవ్యమాచరించి యానందమయమగు మోక్షస్థానముఁ జేరుచున్నాడు. ఇతఁడే మృత్యుబాధను దూరముగ తఱిమివేయు సామర్థ్యము గలవాఁడు. ఇతనికి దేహేంద్రియములు వశమై యుండును.

మానవుని యింద్రియములు దొంగ దలాలీ తనముచే యువారి వంటివి. దొంగదలాలీ చేయువారు వ్యాపారులను మాయాకారియగు వర్తకునివద్దకుఁ బిలుచుకొని పోవుదురు. ఎందుకన దొంగదలాలికి న్యాయమైన యంగడిలో దలాలిలభింపదు. కనుక, వ్యాపారికి నష్టము సంభవించునని తెలిసియుండియు, సామర్థ్యముకొఱకు నక్రమపు యంగడివాని యొద్దకుఁ బిలుచుకొనిపోయి నష్టపరచుచున్నాడు. అలాగుననే మనయింద్రియములు జీవాత్మను ప్రకృతివిషయోప భోగములందే ప్రవేశింపఁజేసి, నష్టభ్రష్టము చేయుచుండును. ఇంద్రియముల యొక్క దురాచరణములవలన జీవాత్మచెముటయేగాక శరీరము సయితము నాశమగుచున్నది. ఒకయోడ తుపానువలనఁగొట్టుకొని పోయినప్పుడు మాలిమి చేయవలసినదేమి? మొదట యోడనిలిచియుండిన స్థలమేదియనియు, దానికి నేదిక్కుగ నెంతదూరమువచ్చినది విచారించినతరువాత స్వస్థానమునకు నోడను నడపవలయును. మానవుఁడేమయిన మఱచియున్నాడా? యనిన తనకు ప్రధానమైన యాత్మబలమును సంసారసాగరమున ముంచివేసినాడని చెప్పక తీరదు. ఆత్మబలమును నౌకయధఃపాతాళమునఁ జేరియున్నది. మరణదుఃఖమను పర్వతమును భేదించుటకు నాత్మబలము వజ్రాయుధము వంటిది. ఆత్మబలమేది? అది మనకెట్లులభించును? అప్పుడది మనకెంత

దూరములోనున్నది ? ఈవిషయమును చర్చించవలయును.

ఈలోక వ్యవహారములకు మాత్రము మానవునకు శారీరకధనాది బలము లావశ్యకములై యున్నవి. ఆత్మబల మిహపర లోకముల రెంటికిని సంబంధమైనది. అనేకు లనేక కార్యములను శారీరక ధనాది బలములుండియు నాత్మబలము లేనందున మధ్య విడిచిపెట్టుచున్నారు. కనుక ప్రతికార్యమును కొంచెమో గొప్పయో యాత్మబలము యొక్క యాధీనమందుండును. అన్ని బలములలో నాత్మబలము ప్రధానమైనది. ఇది ధనాదులచేత నుత్పన్నము కానేరదు. జ్ఞానము, ప్రయత్నము యీ రెంటియొక్క సమ్మేళన శక్తికి యాత్మబలమని పేరు. ఈ రెంటి యభివృద్ధియే యాత్మిక బలమగుచున్నది. దర్శన శాస్త్రమందు సుఖ దుఃఖ యిచ్ఛాద్వేష ప్రయత్న జ్ఞానములు ఆత్మలక్షణమని చెప్పఁబడియున్నది. వీనిలో సుఖ దుఃఖ యిచ్ఛాద్వేషములు నాలుగును శరీరాత్మలయొక్క సంయుక్త బలములుగా నున్నవి. ఒక మనుష్యుఁడు గొడ్డలితో కట్టెను గొట్టుచున్నాడు. హస్తములు, గొడ్డలి, రెంటియొక్క పరస్పర సహాయ మపేక్షితమైనది. రెండును వేఱువేఱుగా, కట్టెను గొట్టజాలవు. ఈలాగున సుఖ దుఃఖాదులు సూక్ష్మ శరీరముతో ఆత్మకు ప్రతీతము లగుచున్నవి. ఏద్రవ్యమందేగాని

దానివిద్య మానములో స్వకీయమగు గుణము ప్రత్యేకముఁ గానేరదు. అగ్ని యున్నంతవరకు దాని సహజగుణమగు నుష్ణము ప్రత్యేకము కానేరదు. ఈరీతిగ జీవాత్మకును, సహజమగు జ్ఞానప్రయత్నములు రెండును సదా కూడియుండును. జ్ఞానము స్వాభావికము నైమిత్తికమని రెండు విధములు. మనకు పదార్థముయొక్క రూప జ్ఞానము కావలసినప్పుడు పదార్థము, కన్ను, ప్రకాశము నీమూడును యావశ్యకములు. ఇట్టిసాధనములు లేకుండ కలుగునది, స్వాభావిక మనఁబడుచున్నది. జాగ్రత, స్వప్న, సుషుప్తి మరణావస్థలయందు జీవాత్మకు తానున్నానను (అహమస్మి) జ్ఞానము సహజముగా నున్నది. దుఃఖాదుల నివృత్తికొరకు నాత్మ సదా ప్రయత్నము చేయుచుండును. ఇట్టి జ్ఞానప్రయత్నములు క్షీణించుటకును, వృద్ధియగుటకును, కారణ మెఱుంగవలయును.

మన మొక యగ్గివుల్లను వర్షముగురియుచు చల్లనిగాలి వీచుచుండుసమయమున, గీచినచో నది మండుట కఠినమగును. గ్రీష్మఋతువునందు సులభముగనంటుకొని మండుచుండును. ఏ పదార్థమునకైనను సదృశపదార్థము లభించునేని వృద్ధియగును. విరుద్ధపదార్థము లభించునేని క్షీణించును. ఆత్మకు సంబంధించిన పదార్థములును రెండు గలవు. ఒకటి

ప్రకృతి; రెండవది పరమేశ్వరుఁడు. ఇందులో ప్రకృతి జ్ఞానశూన్యమైనది; పరమేశ్వరుఁడు జ్ఞానస్వరూపుఁడు. జీవుడును జ్ఞానసహితుఁడు. ఉభయులును చేతనస్వరూపులు. ప్రకృతి జడము; మఱియు నచేతనము; అనగా జ్ఞానవిరహితము. జీవ పరమాత్మ లుభయులును క్రియావంతులు. ఈ సిద్ధాంతమువలన నిప్పు డాత్మకు పరమాత్ముఁ డనుకూలమనియును, ప్రకృతి ప్రతికూలమనియును, స్పష్టమైనది. ఇందువలన జీవాత్మకు నీశ్వరోపాసనమువలన నాత్మబల మధికమగుననియు, ప్రకృతి యుపాసనమువలన నాత్మబలము క్షీణించుననియు, విదితమైనది. చేతనుఁడగు జీవుడు స్వాత్మసదృశమగు నీశ్వరారాధనమును త్యజించి ప్రకృతి యారాధనమును స్వీకరించి యాత్మబలమును క్షీణింపఁజేసికొనుచున్నాడు, గనుక తన రాజధానియగు శరీరమందు నివసించియు, స్వకీయకర్మచారులగు నింద్రియాదులను శాసించుచు, సుఖానందముల బొంద జాలకయుండుటయేగాక, దుర్భరమగుమరణావస్థ వర్ణింపజాలని దుఃఖములనుబొంది, దుర్గతిపాలగుచున్నాడు. ఆత్మబలము ప్రకృతియారాధనమువలన క్షీణించి దానికి బదులు యాత్మగ్లాని సంభవించుచున్నది; గనుక ప్రత్యక్షబాధనుభవించుటగాక నుత్తమజన్మమునకు దూరుఁడగుచున్నాడు. ఏ మనుష్యుఁడు తుచ్ఛపదార్థమును గౌరవించునో అతఁడు తన్ను

తాను తుచ్ఛముగా భావించుకొన్నవాడగును. ఇట్లు తన్ను తాను వినాశపఱచుకొనుటనుగురించి గీతలో చక్కగవివరింపఁ బడియున్నది. ఈయభావనము మనుష్యునియొక్క మానుషత్వ మును పాడుచేసి, వాని యుత్సాహమును భగ్నపఱచి, యు ద్యమమును నష్టపఱచి, శక్తిని లుప్తపరచి, మృత్యుదుఃఖము ననుభవింపఁ జేయుచున్నది. దీనికే యీశ్వరద్రోహ మని పేరు. ఒక యాయుధమును మట్టిలో బూడ్చిపెట్టినయెడల నది మట్టియై నశించిపోవునుగదా? మానవాత్మయు నీలాగు ననే నష్టభ్రష్టమగుచున్నది. ఆత్మబలము లేనివాఁడు నూ నెలోబడిన యీగవలెను, ద్వారము తెలియక గృహములో దిరుగుచుండు యంధునివలెను, పరితాపమునొందునని పెద్దలు చెప్పియున్నారు.

ఇంక సాధనమార్గములను గురించి విచారించుచున్నా రము. కైవల్యస్థితిని ప్రాప్తింపఁ జేసికొనుటకు సాధనము లనే కములుగలవు కేవలముగుస్థితి కైవల్య మనఁబడుచున్నది. ఇతర సంబంధములను విడిచి స్వయం స్వావలంబన పూర్వక ముగ స్వశక్తిని యనుభవమునకుఁ దెచ్చుకొను ప్రయత్నము లకు, యోగసాధనములని పేరు. సాధారణస్థితులలో మను ష్యుఁడు సర్వసుఖములకొరకు రెండవదానియం దాధారపడి

యుండును. ఇట్టి పరాధీన మెప్పటికిని కేవలసుఖముగానుండక దుఃఖసమ్మిళితమై యుండును. యోగసాధనములట్లుగాక సంపూర్ణస్వతంత్రములై యుండును. ఎట్లనఁగా స్థూల సూక్ష్మ కారణశరీరములయొక్క యాశ్రయమువలన జాగ్రత్స్వప్న సుషుప్తియవస్థ లనుభవించుట ప్రతిజీవునియందును గలదు. కనుక వానియందు మానవునకు ననిచ్ఛితమగు దుఃఖప్రాప్తియి తము గలుగుచుండును. శరీరత్రయాశ్రయములేకనే తన యానందావస్థను పొందుసాధనమునకు ముక్తిమార్గమని పేరు. అట్టి పరిపూర్ణస్వాతంత్ర్యమే మోక్షము. దానిని నిరాలంబావస్థ యని తత్త్వవేత్తలు చెప్పుదురు. ఇతరావలంబనములేనిది నిరాలంబనమగుచున్నది. ఈయవస్థయందు పరిశుద్ధమగునాత్మసంబంధము మాత్రముండుటచేత దీనిని ఆత్మయోగ మనెదరు. దీని ప్రాప్తికి ప్రాథమికులనేకవిధములగు యోగసాధనములను కనిపెట్టియున్నారు. వానిలో మంత్రలయ హఠరాజయోగాదులు ప్రసిద్ధిమైనవి. కేవలమంత్రము నొకదానిని జపించుట మంత్రయోగము. దేహేంద్రియాంతర్గతమగు శబ్దమునందు మనస్సును లయముచేయుట లయయోగము. ఆత్మీయమైన సాధనమునకు నంతఃకరణములను బలవంతపెట్టుట హఠయోగము. మానసికముగ నొనరించు సాధనము రాజయోగము. మేమిప్పుడు మరణదుఃఖనివారణమునకును, ముక్తికిని, సాధన

మగు సుషుప్తియోగమునుగురించి వివరించవలసియున్నది. వివేచన చేసి చూచువారికిది, రాజయోగమని వేద్యమగుచున్నది.

అందరికిని సుషుప్తిఅథవా, గాఢనిద్ర యనుభవమేకదా! మనుష్యనకుఁగల సర్వావస్థలలోనిది బ్రహ్మరూపమగు నవస్థగానున్నది. ముక్తియందు సుషుప్తిసమాధియే పరమావధిగానున్నది. ఈసుస్త్యవస్థలో సర్వదుఃఖములును, నితాంతముగ దూరమైయుండును. ఎంతటిభయానకరోగగ్రస్థుఁడుగానున్నను, యెటువంటిక్లేశములు గలిగియున్నను, యీయవస్థయందానందమగ్నుఁడై యుండును. దీనిలో బ్రహ్మానందప్రాప్తినిఁ జేరుటయే మన కర్తవ్యమైయున్నది. ఈయవస్థ మనశరీరమునకు భిన్నమై కేవలము జీవాత్మసంబంధమై యున్నదని మనము వివేచనచేసినయెడల విదితమగుచున్నది. మఱియు నీశరీరముతో జీవాత్మకు ముక్తావస్తయందు సంబంధములేదని తెల్పుచున్నది. ఎంతటిపామరుఁడైనను దీనివలన మన యాత్మశరీరమునకంటె భిన్నమైయున్నదని తెలిసికొనఁగలఁడు. నిద్రకును జాగ్రితకునుగల సంధియవస్థను మన మొక యభ్యాసముచేత ననుభవమునకుఁ దెచ్చుకొన్నయెడల మన యాత్మశరీరములు భిన్నమని ప్రతిక్షణమును ప్రతీతమగుచుండును. దీనిని యనుక్షణము స్మరించు నభ్యాసము మనకు లేనందున మఱచిపోవు

చున్నారము. జాగ్రదవస్థ యొక్క సమాప్తికిని నిద్రావస్థ యొక్క ప్రారంభమునకునుగల సంధిసమయమందు మన మే విధమైన విచారమును మనస్సునం దుంచుకొని యుందుమో యదే విషయముమనకు జాగ్రదవస్థ కలుగువరకును స్థిరమై యుండి యావిచారము స్థూలసూక్ష్మకారణ శరీరములందు పని చేయును. దృష్టాంతముగ మీరొక వేదమంత్రమును అర్థస హితముగ మననముచేయుచు జాగ్రదవస్థనుండి సుషుప్తికి జేరు వరకు పరున్నపుడు ధ్యానముచేయుచుంటిరేని మీరు తెల్లవా రినిద్రనుండి మేలుకొనిన యుత్తరక్షణమునందే యామంత్రము జ్ఞప్తికివచ్చి యదేమననము మీమనస్సునందు నిల్చును. ఉప రోక్త సంధిసమయందు ప్రతిదైతన్యజీవునకును మంచి చెడ్డ విచారములు మానసములందుండితీరును. అట్టి విచారములనను సరించి మన నిత్యకృత్యములందును మన శరీరయింద్రియాదు లందును ప్రభావముత్పన్నమగుచుండును. అది విచారానుసా గరముగ పరిణమింపఁజేయును, గనుక నుపర్యుక్తసంధిసమయ మందు మరణావస్థలో మన తత్త్వము లెట్లు సంబంధము గలిగి యుండునో దానిని వివేచనచేయుచుండు యభ్యాసములవాటు చేసికొంటిమేని మరణము మన కానందదాయకమై యుండును. ఇంతియగాకననేక శుభవిచారములను స్థిరపరచుటకును సువి

చారయుక్తమగు సుషుప్తియవస్థను పొందుటకు దృఢప్రయత్నములు చేయవలయును.

దీర్ఘముగ నాలోచించినయెడల యిది కర్మయోగులకు శ్రేష్ఠమైన సాధనమని నిశ్చయమగును. సాధారణముగ మనలో సుషుప్తియోగమునకు నొక విఘ్నముగల దదే మన సుషుప్తియవస్థకు బదులు మన కధికముగ స్వప్నావస్థ కలుగుచుండును. ఈ విఘ్నము గలుగకుండ కాపాడుకొనువారు యేకభుక్తముచేసియు, వనవాసము చేయుటయు, దేహపరిశ్రమము చేసియు, వానప్రస్థమును స్వీకరించియు, నధికప్రాణవాయువును సేవించియు, ప్రాణాయామమునుసలిపియు, స్వప్నావస్థను రాకుండజేసికొని సుషుప్తియవస్థను ప్రాప్తింపజేసికొనవలయును. జాగ్రత సుషుప్తి యవస్థలయొక్క సంధికాలమునందుసలిపిన సద్గుణ సువిచారములవలన, దేహాత్రయములును, జీవాత్మయు పరిశుద్ధమగును. బుద్ధియు వృద్ధియై, సంశయరహితమై, నిశ్చయాత్మకశక్తి ధారణసమర్థమై యున్నతిఁజెందును. ప్రతియథార్థజ్ఞానమందును శ్రద్ధయు సిద్ధియులభించును.

అభ్యాసకులు ప్రత్యంశమును పరిశీలించి సత్య సాత్విక సిద్ధాంతములను తెలిసికొని వాని నాచరణలో నుంచుట కహా

ర్నిశము ప్రయత్నము చేయవలయును. విచారమందు నిశ్చయాత్మకసిద్ధిలేకుండ సంశయాత్మకుడైనచో దాని ప్రాప్తికి ధ్యానము సంభవింపదు. ఈవిషయమందు సదా సావధానముగ నుండవలయును. యథార్థజ్ఞానము లేనివానికి చిత్తము స్వాధీనమందుండదు. సమృద్ధమగు నిచ్ఛాశక్తి వానియందు త్పత్తి కాజాలదు. సంశయవిరహితమైన జ్ఞానమువలన నిచ్ఛాశక్తి, యేకత్రితమై కొంచెము పనిచేయుటవలన గొప్పగొప్ప కార్యములు సఫలీకృతము లగుచుండును. ఇచ్ఛను స్వాధీనముఁ జేసికొనుటకు సత్యసువిచార మత్యంతావశ్యకము.

మిథ్యను, సత్యమును, మంచి చెడుగుల విచారమును, జేయుట మనోధర్మమై యున్నది. మనస్సుయొక్క శక్తిని స్వాధీనము చేసికొనుటకు మానసయోగమని పేరు. మనస్సెల్లప్పుడు సువిచారమో కువిచారమో కలిగియేయుండును. మనస్సు యేకాగ్రమైనప్పుడే, దాని విలక్షణమగుశక్తి ప్రతీతమగుచుండును. అది చంచలమైనప్పుడు దాని సంకల్పము నశించి, యుపవ్యయమై, శక్తిహీనమై, యవనతి చేకూరును. గనుక మనమేవిచారము కోరెదమో, దానిని మననము చేయునట్లు దాని కాజ్ఞాపించవలయును. ఈవిషయమును తత్వజ్ఞానము స్వాత్మనిరీక్షణమను గ్రంథములందు విపులముగ వ్రాసియున్నారము.

మేమిప్పుడు సర్వసాధారణముగ వాడుకలోనుండు సంగతిని గురించిన యొక భ్రమను తొలగించవలసియున్నది. తత్త్వజ్ఞానులయందు అహమ్మన్యత అథవా యహంకారము యొక్క వివేచన రహస్యము తెలియఁజాలక ననేకులు భ్రమపడుచున్నవారు. అహంకార శబ్దార్థము వేఱువిధమై యుండును. ఇచ్చటనది యాధ్యాత్మికము. "నేనుజీవాత్మను శరీరమునకు భిన్నముగనున్నాను. నాశక్తి నేత్రాదింద్రియములలో ప్రవేశించి కార్యములు చేయుచున్నది. దాని బాధ్యత నాయందుగలదు. కార్యభేదమువలన, నేనున్నతపదవిగాని యధమగతిఁగాని పొందగలను, పురుషార్థమునాపనియైయున్నది" యనెడు నిశ్చయాత్మకవృత్తి తప్పక నుండవలసినది. ఇది గర్వముఁగలిగియుండుట కానేరదు. "నేనుధార్మికజీవనమవలంబించెదను" అను నిశ్చయాత్మక వృత్తితోఁగూడిన యాత్మానాత్మ వివేకము లేకున్న నున్నతస్థితియు, నుత్తమ కర్మయు, ముక్తిసాధనములన్నియు సున్నయగును. ఇంద్రియ నిగ్రహములేకపోవును. వానిని కల్యాణకారకమగు మార్గమందు నడిపించుట సంభవింపనేరదు, గనుకనేను అథవా అహమ్మను భావము గలిగి తనకన్నులతో పరిణామమం దుపకారప్రదమగు శబ్దములనే వినవలయును. ఇట్లు ప్రతియింద్రియమును పరిణామమందు మన యాత్మకు, క్షేమము సుఖముఁగ్గలుగుమార్గము

నందు నడిపింపవలయును. అప్పుడుమన కర్మేంద్రియములు చక్కని ప్రవృత్తులందు పనిచేయును.

వాగింద్రియ ప్రయోగమందు శబ్దశక్తిని, నేత్రేంద్రియప్రయోగమందు రూపశక్తిని యీలాగున, తనస్వయింద్రియ శక్తులను మొదట మననము చేయుచుండవలయును. మనయాత్మయందనేక శక్తులు గలవు. ఒక్కొక్క శక్తి మితిలేని యద్భుత సామర్థ్యముఁ గలిగియుండును. అట్టిసామర్థ్యము క్రియతో సాక్షాత్ సంబంధము గలిగియుండును. ఈ రెంటిని విచారపూర్వకముగఁ జేర్చి కూర్చుటయే యోగమఁనబడు చున్నది.

ఇంతవరకు వివరించిన సంగతుల వలన తేలిన సారాంశమును సంగ్రహముగఁ జెప్పవలయును. మరణదుఃఖనివారణముకొరకు మనశ్శరీరములు రెండును పనిచేయును. ఆత్మకునివి రెండును, సంబంధములు. శరీరమునకంటె మనస్సు సూక్ష్మము గనుక స్వల్పమగు నవకాశమునకు మిక్కిలి చలించును. శారీరకజ్ఞానముఁ గలుగుట సులభము. మనోజ్ఞానము గలుగుట మిగుల కఠినము. శరీరము- మనస్సు- ఆత్మ యీమూటిలో మొదటిరెండును జడములు. ఆత్మచేతనవంతము.

శరీరములోపల మనస్సు మనస్సులోపల నాత్మయును గలవు. ఆత్మయొక్క విద్యమానమువలన శరీరమనోగతులు నడుచు చుండును. ఆత్మకుపైన మనస్సు కవచమువలెను మనస్సునకు పైన శరీరము కవచమువలెనుండును. శరీరస్వాస్థ్యము ననుసరించి మనస్స్వాస్థ్యము, మనస్స్వాస్థ్యము ననుసరించి యాత్మస్వాస్థ్యమునుండును. శరీరము క్షీణించినట్లెల్ల మనస్సుయశక్తమగుచున్నది. ఇది యోగమువలన బలముగలది యగుచున్నది. ఆత్మయొక్క ప్రేరణము మనస్సు నందును, మనస్సుయొక్క ప్రేరణము శరీరము నందును వ్యాపించు చుండును. మనస్సు స్థిరమైనప్పుడు చిత్తమనఁబడుచున్నది. మనస్సు మిక్కిలి శక్తిశాలినియై యున్నది. అది చంచలమైనప్పుడు దానిశక్తి వ్యర్థమగుచున్నది. నీటి బాష్పము నొక ప్రదేశమందు స్థిరముగా నుంచినప్పుడు ప్రబలశక్తిమంతమగును. దానిని బాహ్యప్రదేశమందు విడిచినయెడల వ్యర్థమగుచున్నది. ఈమనోనియమనముల, భేదములను బట్టి కర్మయోగ, భక్తియోగ, జ్ఞానయోగ, రాజయోగ, మంత్రలయ హఠతారకాది యోగము లేర్పడియున్నవి.

“ నేనొక కేంద్రమును. నాచుట్టును యీలోకము. తిరుగుచున్నది. చేతనమునకును విచారమునకును నేను సహాయ

ముచేయు మూలపదార్థమును; నే నీ శరీరమునకు భిన్నమును; నెప్పటికినినశింపను; అమరపదార్థమును; నేను అదమ్యమును; నా కేలాటిక్షతియు బాధయులేదు; నేను చావను; మృత్యువు యీ శరీరమునకే గాని నాకులేదు." అను స్వానుభవము ప్రతిక్షణమునను సంధానము గలిగియుండుట వలన, నుపాస కుఁడగుచున్నాఁడు. జ్ఞానాదు లేకమై యాత్మయందు పడుట వలన నుపాసనము సిద్ధించును. సూర్యకిరణము లద్దముపై యొక్కటిగ, చేరినప్పుడు పదార్థములను కాల్చివేయు శక్తి యుత్పన్నమగుచున్నది. మనమొక సంగతిని జ్ఞాపకముఁ దెచ్చుకొనుటకు స్మరించుచున్నాము. అది జ్ఞాపకమునకు రాకుండ నుండును. అప్పుడు మనము ప్రయత్నమును మాను కొనుచున్నారము. అయినను విషయమప్రయత్నముగ కొంత సేపటికి స్మరణకు వచ్చుచున్నది. కారణమేమి? మనము మనస్సున కాజ్ఞయిచ్చి విషయ పరిచయముకొఱకుఁ బంపితి మి; గాని యంతలో నాతురపడి ప్రయత్నమును, చేయి జారవిడిచితిమి. మనస్సు విషయమునుదెచ్చి మన యాత్మకు సమర్పించువరకు కాచియుండక పోతిమి. కాని మనస్సు దానికిగల శక్తి ననుసరించి కొంతసేపటికి విషయమును తెచ్చి మనయాత్మకు సమర్పించినది. మనలో ప్రాకృతికశక్తి యధిక ముగ నున్నదిగాని, మానసికశక్తి యత్యల్పము. ఆత్మశక్తి

యంతకంటె నత్యల్పము. మన మాత్మబలమును సంపాదింప వలయునన్న పరమాత్మయొక్క సహాయ మపేక్షించవల యును. జ్ఞానము భక్తి మనస్సు నీమూటియొక్క యోగమే ఈశ్వరోపాసనము. ఈవిషయము—భక్తి ప్రార్థనోపాసనమను గ్రంథమందు విస్తారముగ వ్రాయబడినది.

సంధ్యనుగూర్చి పాఠకులకు నొక సంశయము గలుగు చున్నదేమన, పగలుపోయి రాత్రివచ్చునప్పుడును రాత్రిపోయి పగలు వచ్చునప్పుడును సంధికాలమనియు నట్టి సంధిసమయ ములందు సంధ్యావందనము చేయు నాచారముండగా జాగ్ర దవస్థకును సుషుప్తియవస్థకును నడుమనుండు కాలము సంధి సమయమని చెప్పుట విపరీతమని తోచవచ్చును. ఇది భ్రాంతి కార్థము గావచ్చును. మేము వివరించిన సంధి యాధ్యాత్మిక మైనది. సంధ్యోపాసనము సార్వదేశికమైనదిగాని యేక దేశీ యము కానేరదు. సంధ్యోపాసనము మన హిందూదేశము కొరకుమాత్రమె కాదు. అది సర్వమానవులకు సమస్త దేశ ములవారికి ప్రసాదించిన యీశ్వరాదేశము. లోకములో కొన్ని ప్రదేశములందు కొన్ని మాసములు సూర్యదర్శనమే లేదు. మఱికొన్ని ప్రదేశములందు కొన్ని నెలలవరకు సూ ర్యుఁడస్తమించుటయే లేదు. కనుక నాదేశమువారు సంధ్యో

పాసనము కొన్ని నెలలవరకు నుపాసనముచేయక నుండవలసి వచ్చును. మేము వివరించిన సంధిసమయమట్టి యేక దేశీయము కానేరదు. ఇది ప్రతి జీవాత్మకును ప్రతిదినము సంభవించుచున్నది.

ఉపాసకుఁడు మొట్టమొదట “ఓం అమృతోపస్తరణమసిస్వాహా। ఓం అమృతాపిధా నమసిస్వాహా” యని పఠించవలసిన విధి వేదమందుగలదు. ఇందు మొదట “ఉపస్తరణ” శబ్దమును తరువాత “అపిధాన” శబ్దమును గలవు. పరమేశ్వరా! నీవు అమృతమగు నుపస్తరణము నపిధానమై యున్నావని యర్థము. మనము పరుండు సమయమున క్రింద వేసికొను పడకకు, నుపస్తరణమనియు పైన కప్పుకొనుదానికి, అపిధానమనియువేరు. రెంటికి నడుమనుండువాఁడుసర్వ విశ్రాంతితోడ, యారామప్రాప్తుఁడై నిద్రించుచున్నాఁడు. ఉపాసకుఁడు తాను సర్వవ్యాపియగు నా పరమేశ్వరుని గర్భమందు నానంద మనుభవించుచుండగా తనచుట్టు భగవంతుని యమృతావరణముచేత, సత్యము, యశము, శోభా, సంపదలు, ప్రాప్తించునని భావము, “ఓం సత్యంయశః శ్రీర్మయిశ్రీః శ్రియతాంస్వాహా” యని యున్నది. హేపరమేశ్వర! నీవు క్రిందను పైనను యంతటను నావరించి యున్నాడవు. నా

యాత్మ నీయొడిలో నిద్రించుచున్నది; నాకు యథార్థ జ్ఞానమును యశస్సును సుఖసాధనములను ప్రసాదింపుము; నీకు నాసర్వస్వమును అర్పణముఁ జేయుచున్నానని, యుపాసకుఁడు మననము చేయును. ఈవిధి యుపర్యుక్తమగు సంధిసమయముల రెంటిలోఁ దేనికి సంబంధించియుండునో వారకులూహించుకొనవచ్చును.

ఉపాసకున కీశ్వరుఁడు గలడా? యను శంక యుండకూడదు, గాన దానిని వివరించుట సమంజసము. ఈసందేహమున్నచో నుపాసనమే సిద్ధింపదు. లోకమందు రెండుపదార్థములు గలవు. అపరిణామియని పరిణామియని. ఈ రెంటిలో సాకారపదార్థము లన్నియు పరిణామములు. ఏది దేనియందుఁ బుట్టుచున్నదో యది దానియందే లయమై పరిణామ మగుచుండును. అనఁగా కార్యరూపమగు పదార్థమందు పరిణామమును కారణరూప పదార్థమందు నపరిణామము అర్థాత్ నిత్యత్వమున్న ప్రతీత మగుచున్నది. ఇది పరిణామలక్షణము. పంచభూతములనుండిబుట్టిన జగత్తు పంచభూతములందే లయమగుచుండును. సారాంశ మేమన కార్యవ్యవస్థయందు ననిత్యమును, కారణవ్యవస్థయందు నిత్యత్వమును, సిద్ధమగు చున్నది. ఈ యుపాదానకారణమగు పంచభూతములకునమష్టిగ

ప్రకృతి యని పేరు. ఇది జడము, జ్ఞానశూన్యమైనది, గనుక దానియందు చైతన్యశక్తిలేదు. వీనిసంయోగశక్తివలన సయితము చేతనముఁ గలుగదు. బాష్పయంత్రమునందు (రైలు యింజినులో) ను మృతకళేబరమునందును పంచభూతములు చేరియున్నవి; గాని, జ్ఞానశక్తి లేదు, గనుక నీశక్తికి నాధారమగు పదార్థమొకటి ప్రత్యేకముగ గలదని సిద్ధాంతమైనది. జడచైతన్యసంయోగమం దెచ్చటఁజూచినను నియమమున్నది. మనుష్యసంయోగమువలన మనుష్యత్వమును మృగసంయోగమువలన మృగజన్మమును నియమానుసారముగ, గలుగుచున్నది. ఇది నైమిత్తికముగాని స్వభావము కానేరదు, గాన దీనికి నిమిత్తకారణ మొకటి తప్పక యుండితీరవలయును. అది పరిపూర్ణమగు జ్ఞానశక్తిసంపన్నమగు సర్వశక్తిమాన్ పదార్థమై యుండవలయును. దానికే ఈశ్వరుఁడని పేరు. అపరిణామియు నిత్యమునగు దానికి కారణముండదు గనుక నీశ్వరునకు స్వయంభువు ననాదియని పేరు. అతఁడెక్కడనున్నాడను యనుభ్రమ కూడదు. ఎందుకన, నేకదేశీయపదార్థములకు నెక్కడ? యను శబ్దము ప్రయోగమగును గాని విభుపదార్థమునకుఁగాదు. జగద్భరితుఁడు యింటియందుగలడా? యన్న నసంగతప్రశ్నయగుచున్నది. ఈశ్వరుఁడు జ్ఞానచక్షువునకుఁ గోచరుఁడగును, గనుక నుపాసనమునకు సాధ్యుఁడు.

ఈశ్వరుని యాకారమెట్టిది ? యను ప్రశ్నకుత్తరము చెప్పవలయును. అతఁడు "సచ్చిదానందస్వరూపుడు" ఈ వాక్యమందు 'సత్-చిత్-ఆనంద' శబ్దములు మూడున్నవి. త్రికాలములందు విద్యమానమై యుండుదానికి సత్తని పేరు. జ్ఞానాత్మక మైనదానికి చిత్తని పేరు. దుఃఖముయొక్క యత్యంతాభావముగలదానికి యానందమని పేరు. ఆకారము, సంయోగమువలన నేర్పడుచున్నది గనుక సావయవ మగుచున్నది అవయవమనేకవస్తువులతో నేర్పడుచున్నది గాన, నది పాంచభౌతికమగుచున్నది. భౌతికముత్పత్తి పదార్థము; అనఁగా నాద్యంతములందు లేకుండనుండి మధ్యకాలాస్తిత్వమైనది. ఈశ్వరుఁడాదిమధ్యాంత రహితుఁడు గావున సచ్చిదానంద స్వరూపుఁడనఁ బడుచున్నాడు. సాకారపదార్థము సీమాబద్ధ మగును- కావున నతఁడు యేకదేశీయుఁడు కావలసివచ్చును. ఇందువలన నీశ్వరుఁడొక సూక్ష్మపదార్థమని యనుటఁకుగూడ వేదశాస్త్రములొప్పుకొనవు.

పదార్థములన్నియు పరమాణుసంయోగమువలన నేర్పడుచున్నవి. ఈశ్వరుఁడట్లేర్పడినచో సర్వవ్యాపకుఁడు కానేరడు సాంతపదార్థమగును. అనంతముఁగాకపోవును. అప్పుడు, జన్మ వృద్ధి, స్థితి, పరిణామ, క్షీణ, వినాశములనెడు వికారషట్క

ములు గలవాఁడగును, గనుకనే, మతమతాంతరులు చెప్పినట్లు ఈశ్వరుఁడేడన యాకాశమున సింహాసనమునందుఁ గూర్చు న్నాఁడనియు, జీవుఁడే దేవుఁడనియు, నతఁడు మందిరములందు నివసించుచున్నాఁడనియు, నాతఁడుపుట్టి, పెండ్లాడి, జగడములు చేసి, జయించెననియు నతఁడోడిపోయి దుఃఖించెననియు, నాతఁడు భక్తులయిండ్లలో పనిచేసెననియు, నతఁడవతారము లెత్తెననియు, చెప్పెడు సంగతులన్నియు కేవలమసంభవము లుగా నున్నవి. ఇవియన్నియు పౌరాణిక మంతవ్యములు. కఠోపనిషత్తునందు 'అనాద్యనంతం మహతః పరం ధృవం నిచాయ్యతం మృత్యుముఖాత్ప్రముచ్యతే' అనఁగా ననంతుఁ డగు పరమాత్మునిఁ దెలిసినవారు మృత్యువుయొక్క ముఖము నుండి ముక్తులగుచున్నారని చెప్పఁబడినది.

మృత్యుకాలమందు పశ్చాత్తాపవిముక్తుఁడగుటకు జీవా త్మపరమాత్మభావమును దెలిసికొనియుండవలయును. లేకున్న సమస్తసాధనములును సర్వబోధలును వ్యర్థములగును. సత్యముఁ దెలియకున్న ననర్థమగుననియు సాధనములు వ్యర్థమగుననియు నిదివరకే చెప్పియున్నాము. సత్యాసత్య నిర్ణయమునకు సాధ నము సాపేక్షితమై యున్నది. పదిమందిబాలురకొక గణితము (లెక్క) యిచ్చుచున్నాము. దానినైదుమంది సరిగాచేసియు

న్నారు. తక్కినవైదుమందియు తప్పుచేసినారు. సరిగాచేసిన వారి మొత్తమొక్కటీరుగా నుండును. తప్పిపోయినవారి మొత్త మువూత్రమైదువిధములుగానుండును. అలాగుననే మిధ్యలెప్పటికిని, యొక్కరీతినుండక నానావిధములై యుండును. మత మతాంతర సాంప్రదాయము లిట్టివియని యుపాసకులు గ్రహించి సత్యమార్గము ననుసరింపవలయును. అదే వేదమార్గము. వేదము సదాచరణము సద్గుణము సుస్వభావములు ప్రాముఖ్యమనుచున్నది. ఆశ్రమములను పాలించు మనుచున్నది. “ధృతిక్షమా దమో౽స్తేయం శౌచమింద్రియ నిగ్రహః ధీర్విద్యాసత్య మక్రోధో దశకం ధర్మలక్షణం” బనుస్మృతి వాక్యముచొప్పున ధర్మలక్షణముల పదింటిని రక్షించుమని బోధించుచున్నది. వైదిక ధర్మ విరోధి వేదమార్గ మవలంబింపడు, గనుక వాడు సఫలత నొందజాలడు. ఈ సఫల విఫలములు మరణ సమయమందు ప్రాముఖ్యములు, గావున త్యాజ్యవిషయములుగావు. కనుక సత్యమార్గమువలన సఫలత్వము ప్రాప్తించును. పాఠకులిదివరకు మూలగ్రంథమాలికయందు దేహవియోగసమయమందు మనకు మృత్యుసంకల్పము గలుగునని యున్నదానికి కారణములున్నవని చెప్పియున్నారుకదా? ఈ సంకల్పము స్థూలశరీర వియోగమందలి యంతిమ ప్రయత్నమగుచున్నది. చావునకుసంకల్పించినతరువాత జీవాత్మకు

మరణదుఃఖము ప్రతీతము కానేరదు. అప్పుడు మూర్ఛ తోఁగూడిన స్వప్నావస్థను జేరును. ఈ యవస్థయందే సాధారణమగు జీవాత్మ వాని జీవిత సంస్కారముల ననుసరించి కొంతకాలముండును. మనకీ లోకమునందు సయితము మన జీవనముయొక్క విచారానుకూలముగ స్వప్నములు గలుగుచుండును. మరణానంతరము జీవాత్మకు రెండవస్థలున్నవి. ఇవియు స్వప్నసుషుప్తులకు సమానమైనవని చెప్పవలయును. ఈ యవస్థలయొక్క కాలపరిమితి వాని యాయుష్యము యొక్క ఘటనానురూపముగ నల్పముగానో దీర్ఘముగానో సంభవించును. ఎట్లనఁగా కొద్దిదినములు బ్రతికి మరణము నొందిన బాలునకు నత్యల్పకాలమువరకు మాత్రమె యీ యవస్థలో వ్యతీతము చేయవలసియుండును. ఈ రెండవస్థలును ఆత్మకు విశ్రాంతియవస్థలగుచున్నవి. అందువలన నేవనిజన్మమందే విధమైన గుణకర్మస్వభావము లవలంబింపఁబడియుండునో ఆప్రకారముగా విశ్రాంతి లభించును. ఈవిశ్రాంతి కారణముచేత రెండవజన్మమందు ద్విగుణితమైన యుత్సాహము ప్రాప్తించును. సత్యసదాచారవిచార జీవనము జరిపిన వాని మరణోత్తరవిశ్రాంతి యధికముగనుండును. తదితరుని విశ్రాంతియల్పముగ నుండును. మనకిప్పుడు ప్రతిదినము నిద్రవలన స్థూల శరీర యాయాసము దూరమైన విధముననే మరణానంతరవిశ్రాం

తివలన సూక్ష్మదేహముల యొక్క యాయాసము దూరమై మరల క్రొత్తశక్తి యుత్పన్నమగుచుండును. స్థూలసూక్ష్మకారణశరీరములు క్షీణింపకుండ జేయుటయే, యోగసాధనముల

ఔరంగజేబు బాదశాహుడు తన మరణసమయమందెంత దుఃఖ మనుభవించి తన కొమరునికేమి చెప్పినది స్వాత్మనిరీక్షణమను గ్రంథమున జదివియున్నారు. ఆదుఃఖమునకు కారణము వాని జీవితచరిత్రము మన యెదుటనున్నది. అట్టి జీవాత్మయొక్క మరణానంతర విశ్రాంతి యెంతటి ఘోరమైనదో యూహించుడు. ఎవని జీవనప్రవాహము నిందనీయమగు హీన భావములతో గూడియుండునో వానియాత్మ దూషిత దుస్తేజములతో మరణ సమయమునందు తనకు తాను ప్రత్యక్షమగుచుండును. కనుకనే బాహ్యావ్యవహారములను ఆక్రమణచేసి జయించుటకు పూర్వము లోపలి సంసారమును జయించుట యావశ్యకమని మన పూర్వులు చెప్పియున్నారు. ఈ యభ్యాసమువలన మానసశక్తి యంతయు బైటి వ్యావహారికములందు వ్యయముగాక నొక్కటిగా సంచిత మగును. ఇట్లు చేయుటకే ధారణమని పేరు.

మనలో నామరూపములేని యింద్రియములు కొన్ని

గ్గలవు. ఆకలి దప్పి మొదలగువాని బోధ మనకు నేయింద్రియములద్వారా కలుగుచున్నదో దానికి నామరూపములు లేవు. ఇట్టివానిని గురించి పూర్ణముగ మననము చేయవలయును. అదియేది? యెక్కడినుండి వచ్చినది? దాని యభిప్రాయమేమి? దానివలని లాభనష్టములేవి? దాని సంభవమేమి? సంబంధమేమి? ఈమొదలగు నన్వేషణములను చక్కగ మననము చేయుటవలన ధ్యానధారణము లేర్పడును. త్రికరణశుద్ధిలేనివారు బాహ్యాచారములను మాత్రము పాటించుచుండుట వలన గర్వపూరితమైన యహంకారముచేత వృద్ధియగుచుందురు, గనుక నట్టివారియందు ధ్యానధారణము లంకురింపజాలవు. మొదట నామరూపాత్మకమైన యీ శరీరము తనది కాదనియును నిది సమస్త జీవరాశికి స్వత్వమగు ప్రకృతిధారా ప్రవాహమనియు మననము చేయనివారికి నామరూపములు లేని యింద్రియములను గురించియు నాత్మను గురించియు పరమాత్మను గురించియు మనన మెట్లుచేకూరును? దైవిక, మానసిక, యాత్మిక ప్రవాహములనుదాటిన తరువాత పరమాత్మజ్ఞానము లభించును. అప్పుడు సమస్త దుఃఖములనుండి విముక్తి సంభవించును.

ఈ సృష్టి నిర్మాణముపై ధ్యానముంచి పరిశీలించుము!

ఏదో యొక యదృశ్యచేతనము తన బుద్ధి కౌశలత్వముచేత యద్భుతమగు హస్తములతో చేయుచున్నట్లు స్పష్టమగుచున్నది. ఒక వృక్షశాస్త్రజ్ఞుఁడు పుష్పమును దూరవీక్షణముతో పరిశీలించిచూచి ప్రతినిమేషణమును దాని పరివర్తనమును కని పెట్టును. ఈ స్థూలసృష్టి పరివర్తనమునకు కారణమయిన సూక్ష్మపదార్థమును కనుగొనుటయే ధ్యానముయొక్క పరమావధి. సృష్టికి పరమావధి ప్రళయమువలె పరివర్తనమునకు పరమావధి మరణము. ఇదంతయు చేతనమునకు వెలుపల జరుగుచుండును. దీనియందు ధ్యానముంచుటకు దివ్యదృష్టి యనిపేరు.

మనమీయత్యద్భుతమగు దివ్యదృష్టితో జూచినయెడల మనయాత్మలో నేవిధమైన భయముండదు. మనలోపల పిరికి మృగములున్నవి. మఱియు క్రూరజంతువులును గలవు. అవి ప్రకృతి సంబంధమైన రూపములులేని యాకారములు గలవియైనను పరులపై విడిచినప్పుడు పరులను పీడించి బాధించును. మనమీదను యాక్రమణముచేసి యుద్ధముజేయుచుండును. వానిని మనము దైవ దృష్టితోజూచిన తక్షణమే దూరము తొలఁగిపోవును. సారాంశమేమన, యేగుణముగాని బాహ్యము నుండి లోపలపోయి జీవాత్మను మలినపరచునది యేదియు

లేదు. లోపలినుండివచ్చు దుష్టభావములు పరిశుద్ధాత్మను అపవిత్రము చేయుచుండును. మనము పాములను పులులను పెంచియున్నారముగాని వానిని పరులపై యుసికొలిపివిడుచుట భావ్యము కాదుగదా? ఒకవేళ నవి యితరులపై నాక్రమణము చేయుటకు బ్రయత్నించెనేని యాటంక పెట్టుచున్నారము గదా? అలాగుననే యాంతరిక దుర్గుణములను మనము దివ్యదృష్టితో నడంచుచుండవలయును.

మొదట మానవుండు కారణము లేనట్టియు నాధ్యాత్మిక విషయములో వ్యర్థమైనట్టియు బాహ్యభయములను త్యజించవలయును. సుఖదుఃఖ లక్షణములు మేమిదివరకే వివరించియున్నారము. బైటిభయము లుండువరకు నాంతరికమగు భయము లేకపోదు. పూర్వమొక శిష్యుండు తనగురువును లోకమందధికదుఃఖాత్ముం డెవండని యడిగెను. మానవసమూహములో శత్రుత్వముం బెంచుకొనువాండని బదులుచెప్పెను. అందెందుకు కలుగునని మరల యడుగ ధనాశవలన గలుగునని ప్రత్యుత్తరమిచ్చెను. సాధారణముగ ధనికులు తమ పుత్రులను సయితము శత్రువులుగ భావించి భయపడుచుందురు. మరణ భయము కంటెను యీ బాహ్యభయములకు మిగుల దుఃఖించుచుందురు. వివేచన పూర్వకమగు జ్ఞానదృష్టి

తోఁచూచు వారికిట్టి బాహ్యదుఃఖములు నితాంతముగ గలు
గవు. అంతయు తన మేలుకొఱకేయని సమీక్ష చేయుచుండ
వలయును.

"యద్యాత్మామలినోఽ స్వచ్ఛో వికారీస్యాత్ స్వభా
వతః నహితస్యభవేత్ ముక్తిః జన్మాంతరశతైరపి" యేజీవుఁ
డు స్వభావముగ తనయాత్మను యపరిశుభ్రపరచి మలినాత్ముఁ
డై వికారియగునో యాజీవికి నెన్ని జన్మములకును ముక్తిలభింప
దని తాత్పర్యము.

## మనము బ్రతికియున్నామా?

మృత యనఁగా చావు. అమృత మనఁగా జీవితము.
వేదమందు "య ఆత్మ దా బలదా యస్యవిశ్వ ఉపాసతే। ప్ర
శిషం యస్యదేవాః యస్యచ్ఛాయామృతం యస్యమృత్యుః
కస్మైదేవాయ హవిషావిధేమ" (య ౨౫-౧౩) ఏవిధము
చేత మనుష్యుఁడు మృతుఁడనఁబడుచున్నాడు? మఱియు నే
విధముచేత అమృతుఁడనఁబడుచున్నాడని గలదు. ఆత్మను
ఆత్మకు బలమును యిచ్చువాఁడెవఁడు? ఆత్మబలమునుగూరించి
యిదివరకే చెప్పియున్నారము. పదియాఱ్వమ్ములు జీవముక్తుల
కొఱకు రాజసేవకుఁడు మహాధనికుఁడగువానిని పట్టుకొని పోవు

చున్నాడు వానిని యెవరును నడ్డగింపజాలరు. ఆ రాజసేవ కున కంతటిబల మెచ్చటినుండి వచ్చెను? రాజునుండి వచ్చిన దని చెప్పక తీరదు. ఈప్రకారముగ పరమాత్మయొక్క నియ మములను తెలిసికొని వానిని పాలించువానికి యాత్మబలము గలుగును. "యస్యవిశ్వఉపాసతే" సర్వజనులు నెవరిని యు పాసించుచున్నారు? వారే అమృతులు అనఁగా బ్రతికియుం డువారు. తక్కిన వారందరు మృతులని యభిప్రాయము.

మనము మాటలాడుచు శబ్దముచేయుచున్నాముకదా చచ్చినవా రెట్లగుదుమని శంక కలుగును. మనకంటె నధిక శబ్దముచేయు నినుపదారిబండిని జీవితపదార్థమని యెవరు చెప్పగలరు? సంగీతము పాడునట్టియు మాటలాడునట్టి యం త్రములు జీవితములనిభావించువారుగలరా? మనమా నేర్చి నని భావను మాటలాడగలమా? ఇందువలన శబ్దమాత్ర ముచేత మానవుఁడు జీవితుఁడు కానేరడు. తిని త్రాగుట నడు చుట మున్నగు పనులుచేయుట నయితముజీవితములు గానే రవు. ఎందుకన నీపనులన్నియు పలువిధములగు యంత్రము లు చేయుచున్నవి. సంతానవృద్ధి చేయుచున్నారమే యనిన పశు పక్షి వృక్షాదులందును సంతానవృద్ధి గలదు, గావున మనమును పశుప్రాయులని యొప్పుకొనక తప్పదు. కనుకనే

మనము మరణదుఃఖమునకు భయపడుచున్నారము. ఈ పశుత్వముపోయి మనయందు మానవత్వమును దేవత్వమును స్థిరపడవలయును. అప్పుడు మనకు మరణదుఃఖము ప్రతీతి కానేరదు. ముక్తియు లభించును. దుఃఖ మనుభవించు తత్త్వము పరమాత్మని యుపాసనమందు సదా లగ్నమైయుండగా దుఃఖానుభవ మెక్కడిది? దానికే సమాధియని పేరు.

జ్ఞానరహితము శరీరసహితమైన జీవుడు పరమాత్మసంబంధముచేత సుఖదుఃఖదూరుడై యుండు స్థితికి సుషుప్తియనియు, జ్ఞానసహితము శరీరరహితమునైన జీవుడు పరమాత్మ సంబంధముచేత సుఖదుఃఖప్రతీతిలేకుండు స్థితికి సమాధియని పేరు. జ్ఞానసహితము శరీరరహితమైన జీవుడు బ్రహ్మతో సంబంధమై సుఖదుఃఖప్రతీతి లేకుండనుండు స్థితికి ముక్తియని పేరు. ఇప్పుడు మనకేమి బోధయగుచున్నదో చూడుడు! సుషుప్తియందు జ్ఞానము లేకుండియు జ్ఞానముండియు పరమాత్మసంబంధమాత్రమున దుఃఖప్రతీతి మనకు కలుగదు. అట్టి పరమాత్మయొక్క యుపాసనమును జ్ఞానసహితముగ నాచరించువానికి మరణదుఃఖము ప్రతీతికాదని విస్పష్టమైనది.

మనము ప్రతిదినము స్నానముచేసినను మైల చేరుచు

నేయుండును. అలాగుననే మన యాత్మలకు ప్రకృతిసంబంధ మొండుటచేత దోషములంటు చుండును. దాని నివృత్తికై ఘన విశ్వరోపాసనము చేయుచుండవలయును. అది జ్ఞాన యుక్తమై యుండవలయును. మనము చేయు ప్రతికర్మయు నిష్కామ్యకర్మమై యుండవలయును. నీటిచేత శరీరము శుద్ధ మైనట్లు సత్యమును గ్రహించి, సత్యమును విశ్వసించి, సత్య మునాచరించుటవలన మనస్సు శుద్ధమగును. ఆత్మపరమాత్మ యనాత్మలయొక్క జ్ఞానమువలన బుద్ధిశుద్ధమగును. ఈశ్వరో పాసనమువలన జీవాత్మ శుద్ధమగును. ఒక ప్రయాణికుఁడుతన పాదములను నేలపై యుంచక యాత్రను సలుపుటకై యెంత టిప్రయాసపడినను వ్యర్థమగునట్లు జ్ఞానములేనివాఁడు ధనికుఁ డైనను పండితుఁడైనను మహారాజైనను చక్రవర్తియైనను వాని జీవితమంతయు వ్యర్థమగును. ఒకనికి చల్లదనము నం దిష్టము గలిగినది. వాఁడు శైత్యసంపాదనముకొరకు అగ్నివద్ద గూర్చుండినచో వానికి శీతలత్వము లభించునా ? ఇదేప్రకా రము మన కానందము యెచ్చట లభించునో దేనివలన దుఃఖ నివారణమగునో యట్టి జ్ఞానమును పొందక నట్టి యీశ్వరోపా సనమును జేయక దుఃఖప్రాప్తికి హేతువులగు ప్రకృతి యజ్ఞా నమును గోరుచు వానిని యుపాసించు చున్నారము, గనుక నది దుఃఖమును ప్రసాదించుచున్నది.

శ్రోతకులారా ! మరణ దుఃఖమునకు కారణములను దాని నివృత్తికి మార్గములను తెలిసికొంటిరా ? యని యడుగుచున్నాను. భార్యా భర్త లిరువురు భారతమును విని యింటికి వచ్చిన తరువాత భర్త భార్యనుజూచి భారతము నందేమి యుపదేశమును స్వీకరించితివన నామె భర్తతో " స్త్రీకి నైదుగురు పతులుండినచో నది మహా పతివ్రతయ నియు దాని మానమును దేవుడు కాపాడుననియు నాకి ప్పుడు ముగ్గురు గలరనియు నిక యిద్దరిని సంపాదించు కొని భగవంతునకు భక్తురా లగుదుననియు బదులు చెప్పెను " లోకులు యథార్థ తత్త్వమును గ్రహింపఁజాలక తమ యా చారానుసారముగ నుపదేశముల నన్వయింపఁ జేసికొను చుందురు. గీతలో " అంత కాలేచమామేవ స్మరన్ముక్త్వా కలేబరం । యఃప్రయాతి సమద్భావంయాతి నా స్త్యత్రసం శయః । యంయంవాపిస్మరన్భావం త్యజత్యంతే కలేబరం । తంతమేవైతి కౌంతేయ సదాతద్భావభావితః " యని చెప్పి యుండుదాని యథార్థము నెఱుంగఁజాలక నెంత పాపాత్ముఁ డైనను అంత్యకాలమున భగవన్నామ ముచ్చరించిన మోక్ష మని భ్రమించి చచ్చువానినోట నారాయణాయని పలికించు టకుఁ బ్రయత్నింతురు. భావమున్నట్లు గతి గలుగుననియు నిట్టి భావస్మరణమునకు సదా చరణము సాధనమగత్యమనియు

దాని యర్థముగాని పేరును పలుకుట మాత్రము చాలునని యర్థము కానేరదు. కొందరు కొన్ని కథలు చెప్పుకొనునట్లు మరణ సమయమందు నారాయణా యని పలికించుట కెన్ని ప్రయత్నములు చేసినను పలుక జాలరనియు తుదకు వేసారి "నార" యను రెండక్షరములైనఁ బలికినఁ జాలునని వానికి లెంకాయనారను జూపి దీనిపేరేమని యడుగ వాఁడు 'పీచు' యని యుచ్చరించునుగాని వానినోట నారశబ్దము రాదనుట యు విచారించగా నొక యంశము మనకు బోధపడుచున్నది. మరణసమయమందు శుద్ధమును, ఉచ్చమును, పవిత్రమునైన విచారముండుటకు నెటువంటి యాచరణ మావశ్యకమో అటువంటి యాచరణముఁ గలవాఁడు గావలయును. ఏ విచారము అథవా, భావము దినమంతయు నుండునో యావిచారమే స్వప్నమునందుండుట సర్వజనవిదితము. ఈ నియమాను సారము జాగ్రదవస్థయందును నట్టి విచారము ననుసరించియే కర్మ జరుగుచుండును. ఈ ప్రకారముగ తన జీవితము త్తమ మార్గమున నడచినయెడల నంతిమసమయమందట్టి సద్భావమే తన యాత్మయందు వ్యక్తమగుచుండును. ఈ యుద్దేశముచే తనే వేదమందు "భద్రంకర్ణేభిః శృణుయామ దేవాః। భద్రం పశ్యే మాక్షభిర్యజత్రాః। స్థిరై రంగైస్తుష్టువాం సస్తనూభిర్వ్యశేమ। దేవహితం యదాయుః" అనగా కల్యాణకారకమగు

న్నుపదేశమును చెవులతో వినుము. శుభప్రదమగు దృశ్యము న్నుజూచుము, దృఢాంగయుక్తముగ మన శరీరము సంపూర్ణ య్యాయువు పర్యంతము త్తమ విచారములతో దేవతలకు హిత ముఁజేయుచుండవలయును అనఁగా, మన శరీరము సత్కర్మము నకు సమర్పణముఁ గావలయును. మన యింద్రియములు ప్రశ స్తపురుషార్థమందు పనిచేయవలయునని తాత్పర్యము. మన మనస్సు సదాశుభవిచారములందు స్థిరముగానుండినచో స్వభా వము పరిశుద్ధమగును. అట్టివాని మరణ సమయమందు విచా రము పరిశుద్ధముగా నుండుటచేత దుఃఖము నితాంతముగ ప్రతీతికానేరదు. మఱియు మన భవిష్యము మన చేతిలో నుండును.

## అంతిమ నివేదనము.

పాఠకమహాశయులారా! మేమీగ్రంథమునకు భూమిక వ్రాయలేదు. కారణమేమన దీని పీఠిక స్వాత్మనిరీక్షణ మను గ్రంథముగా నున్నది. దాని నిదివరకె ప్రచురించితిమి. తత్వ జ్ఞానము ఈశ్వరభక్తి ప్రార్థనోపాసనము అను రెండు గ్రంథ ములను దీని కనుబంధములుగా గ్రహింపుడు.

అభయప్రదాతయగు పరమేశ్వరు డంతటనున్నవాఁడు వాని భక్తులు సర్వత్రసర్వదా నిర్భయులై ధర్మానుష్ఠానమును

యథాస్థితి జరుపవలయును. స్వస్తి శాంతి నిర్భయము యీ మూడును ధర్మపాలనమునకు మూలములు. స్వస్తివలన శరీరారోగ్యమును, శాంతివలన సమాధానమును, నిర్భీతివలనసుద్యోగమును, సిద్ధించును. గనుక స్వస్థశరీరము శాంతచిత్తము నిర్భయమైన మానసమును నావశ్యకములు. వేదము దీనినే బోధించుచున్నది.

" అభయంనః కరత్యంతరిక్షమభయం ద్యావాపృథివీఉభే ఇమే। అభయం పశ్చాదభయంపురస్తాదుత్తరాదధరాదభయం నోఅస్తు । అభయం మిత్రాదభయమమిత్రాదభయం జ్ఞాతాదభయం పరోక్షాత్ । అభయం నక్తమభయం దివానః సర్వాఆశామమ మిత్రం భవంతు॥ "

ఓం శాంతిః శాంతిః శాంతిః



# భ జ న కీ ర్త న లు.

## వసంతతిలకము.

1 పరమేశ్వరా! పరమపురుషా! పరమమేధా! సుబోధా ♦
కరుణామయా! కర్మఫలాధికారా! సదా॥

2 సర్వప్రకాశక! సనాతన! ధర్మపాలా! సుశీలా! ♦
సర్వేశ్వరా! సకలవిద్యామయ! విధివిశాలా! ॥

3 ఓం భూః! ఓం భువః! ఓం స్వప్రకాశా! సురేశా! ♦
ఓం సర్వజగదుత్పాదకేశా! పరేశా! ॥

4 ఓం సగుణ నిర్గుణ! సచ్చిదానందరూపా! ప్రతాపా! ♦
ఓం సత్యస్వరూప! సామ్రాజ్యప్రచురదీపా! నిరూపా!

5 ఓం అద్వితీయానుపమ! జగదాధికారా సుధీరా! ♦
ఓం అవిద్యాంధకారనిర్మూలన! నిర్వికారా శరీరా! ॥

6 జగదీశ్వరా! జంతుసంతానరక్షా! సుశిక్షా! ♦
నిగమప్రదాత! నిశ్చల! సత్యదీక్షా! విచక్షా! ॥

7 విశ్వేశ్వరా! విశ్వరూపా! విశ్వరక్షా! విధాతా! ♦
విశ్వోదరా! విశ్వజనీన! విశ్వంభర! వినీతా! ॥

8 ప్రాణప్రియా! ప్రాణపతే! ప్రాణరక్షా! ప్రకాశా! ♦
ప్రాణప్రదా! ప్రాణజీవన! ప్రాణధామా! అశేషా! ॥

9 అజన్మా! అనంతా! ఆదిమధ్యాంతరహితా! నియంతా! ♦
అజరామరా! అభయ! నిత్య! పవిత్ర! కరుణానితాంతా! ॥
10 సర్వోత్తమా! సర్వలోకైకనాథా! శరణ్యా! ♦
సర్వోపకార! సుఖసాధన! దీపితానంతగణ్యా! ॥
11 కరుణాకరా! కలుషమార్గకలాపధ్వంసావతంసా! ♦
పరలోకపాల! పరమానందప్రదా! పరమహంసా! ॥
12 సుఖదాయకా! సుప్రసిద్ధా! సుప్రసన్నా! సుదీప్తా! ♦
సకలాధికార! సర్వాంతర్వ్యాపకా! సజ్జనాప్తా! ॥
13 సంసారసౌఖ్యసర్వసంపదసత్యధర్మప్రదాతా! ♦
హింసాదిక్రూర గుణకర్మస్వభావా విఘాతా! ॥
14 నిరాధారా! నిర్వికల్పా! నిత్యసత్యప్రయుక్తా!
పరాత్పరా! పావనా! పాలితాసంయమోక్తా! ॥
15 స్వయంభూ! జగపతే! మాంపాలయా! సహాయ! ♦
నియంతా! నిత్యపూతా! నిర్మలా! నీతిహృదయా! ॥
16 దేవా! నమస్తే ధ్యాతవ్యనిరూపమూర్తీ! ♦
భావాత్మ! భక్తహృదయస్థిత సర్వసంశయనివర్తీ! ॥

శ్లోకరత్నావళమ్ము.

1 దేవదేవ! పావనా! నమస్తేనమో-భావవేత్తభూతతోష!
భవవినాశకా! త్రైలో-కా-ధీ-శా! పాపవినాశా!

2 అజరామరాది కారణా! నమస్తేనమో! -భజనీయభవ్య భోగమోక్ష-దాత! సురేశా! -త్రిజగో-ద్ధా-రా-శ్రీ-ఆర్య హృదీశా! ॥దే॥

3 కరుణాకరా! పరాత్పరా! నమస్తేనమో! -పరమేశదివ్య తేజోమయ! పతితపావనా! -పరమా-త్మా-దే-వా-జగదీశ సురేశా! ॥దే॥

4 సురభూషణా! భయవారణా! నమస్తేనమో! -పరిపాలి తాఖిలాండకోటి! భద్రకారణా! -ప్రియాం-తా-కా- లా-సర్వనియంతా! ॥దే॥

5 భవభీకరా! భువనేశ్వరా! నమస్తేనమో! -శివశంకరా! సుగుణాకరా! భువనైనపాలకా! -పరిపూ-ర్ణా-నం-దా- పరమపూరుషా! ॥దే॥

6 గణనాయకోపకారకా! నమస్తేనమో! - అణురూపనిర్వి కార మహాకార్యసాధకా! -సుగుణా-కా-రా-మాం - రక్ష మహేశా! ॥దే॥

7 పరిపూర్ణవ్యాపకేశ్వరా! నమస్తేనమో! -వరభక్తజనవ్రా తవినుత! భరితత్రిభువనా! -ధరనా-రా-యా - ణా-వంది తత్మకా! ॥దే॥

8 భైరవి-అథవా-ముఖారి. అటతాళము.

ఎక్కడ జూచిన నీవేయందురు తండ్రి, యెందుదాగియు న్నావురా! -అక్కటక్కట భక్తులందరు డెందములందున బంధించిరా? సాధించిరా? ॥ఎక్కాడ॥

1 ఇందరమునుగూడి-యేకమై యది యిది యిమ్మందురను కొంటివా? మందులమైనేనీ-ని బంధనలను విూటి-నందున కలిగితివా? మరచితివా? ॥ఎక్కాడ॥

2 తన తనయులయందు తప్పులు గల్గిన-తండ్రితా విడనా డునా? ఘనముగ నీతివాక్యములను బోధించి-కలుషము లడగింపడా? కరుణింపడా? ॥ఎ॥

3 నీవేదైవమని నెఱనమ్మియున్నాము-కావకుండుటతగవా? కోవిదులమె నిన్ను గొనియాడి తనియింప-కేవలమూఢుల మూ-కించజ్ఞులము ॥ఎ॥

4 భూమిసేయుటకన్న పోద్దు సేయుటకన్న - భూతసృజన కన్ననూ। పామరులగు మమ్ము పాలనసేయుట-భరమని తలచితివా? యలసితివా?॥ ఎక్కాడ॥

*

4 బేగడరాగము. అటతాళము.

పరమాత్మ సేవింపుడీ-యనుదినమున్-బరతత్వమును గను

డి॥ సరసిజదళగత జలబిందు వట్టులు-తరళ మీ దేహము-
స్థిరమని నమ్మక ॥ప॥

1 ఎన్నో చెప్పగనేటికి-నిరతము మన-కన్నులఎదుట దానికి। ని
న్న చూచినవారము నేము గానఁగరాదు। ఇన్యామిప్పుడె
చేయఁబూనుఁడు మనకన్న ॥ప॥

2 మొదట బాల్యమునందునా, మేమెఱుఁగని, మూఢులమై
యుంటిమి। పొదలు జవ్వనమున మదమునఁ దిరిగిన-ము
దిసి కదలలేక ముక్తి సాధింతుమె? ॥ప॥

3 ఉదరపోషణమునకై। యీభువి మన-మున్న యాయువు సెల్లి
న। పదపడి నరకాగ్నిపాలు కావలసెను-నిదియెంచి దురిత
ముల్ చెదరిపోవునట్లు ॥ప॥

కారుణ్యమయుఁడాతఁడూ-చిద్రూపుఁడా - కారశూన్యుఁడు
నిత్యుఁడూ। కూరిమి తను గొల్చువారల నేలుగును। జేరఁ
దీసి మమ్ముఁ జేపట్టి రక్షించు ॥ప॥

5 కేదారగౌళ-రూపకము.

నీకంటె దాతలెవరు? లోకైకనాథా! (యీజగమున) నీ
కంటె దాతలెవరూ ॥ప॥

1 ఉండుటకు నీయుర్వినిచ్చి। యూపిరిసలుప గాలినిచ్చి। వం
డుకొనుట కగ్నియును। దండిగాను నీరిచ్చిన ॥నీ॥

2 ఫలములు పుష్పంబులును। పలువిధ ధాన్యంబులును।ప
లువిధముల వస్త్రంబులు। పంచిపెట్టిన వాడవుహా ॥నీ॥
3 తల్లిదండ్రుల నిచ్చితివి। తగు గృహంబుల నొసఁగితివి।
యెల్లసంపదలనిచ్చియు। చల్లగాను గాపాడెదు ॥నీ॥
4 ఏరికేది కావలెనో। వారికెల్ల నద్దానిని। కోరినట్లుగ దీర్చి
తివి। శౌర! దానశూర వీర ॥నీ॥
5 వింతయగు శరీరమిచ్చి। విమలమైన జ్ఞానమిచ్చి। సంతత
సత్కర్మమిచ్చి సన్నిధిలో జేర్చుకొనెదు ॥నీ॥
6 సూర్యచంద్రుల నిచ్చితివి। శుద్ధవేదమొసఁగితివి। ఆర్యధ
ర్మమిచ్చి మాకు। నఖిలసుఖముఁ జేకూర్చిన ॥నీ॥

## 6 కాంబోది. ఆదితాళం.

మూడు దినమ్ముల ముచ్చటగని యుప్పొంగకె యోమ
నసా। యీ। పాడుశరీరము బాసినపుడు నీ-పాప్రీతియేమొ
మనసా॥
1 ఈనరజన్మము-యెంతో దుర్లభ-మిది యెరుగవెమనసా।ఇక।
హీనజన్మములనెత్తక మోక్షం బెక్కఁజూడు మనసా॥మూ॥
2 హత్య యసత్యము - నన్యాయచౌర్యము - వ్యభిచారము
మనసా। ఇవి। ప్రత్యేకమునీ-బ్రతుకునధోగతి-పాలుసేయు
మనసా॥మూ॥

3 స్వామిదోహము-చాకిమాటలగు-చాలబరువె మనసా। యా। భూమిమీాద నీభోగము స్థిరమని। జోర్లపడక మనసా ॥మా॥

4 కామక్రోధ వికారవర్గమును। కడజేర్పకు మనసా। నీ। నీమము నిష్ఠయు నిప్పులగలయును నిక్కముయో మనసా। మా॥

5 ధర్మముఁ దలపక ద్రవ్యముదాచుట। తప్పనుమీా మనసా। దుష్। కర్మముగాల్చియు స్వర్గమిచ్చునది ధర్మమె యో మనసా ॥మా॥

6 చెట్టఁబట్టి నినుగట్టుఁ జేర్చునది చిత్తశుద్ధి మనసా। నీ। జుట్టుకాదు నీబొట్టుకాదు నీకట్టుకాదు మనసా॥మా॥

7 సాధుసజ్జనుల సేవయెముక్తి యొసంగును యోమనసా। దుర్। వాదములను విడనాడియుభక్తుల వదలకు యో మనసా॥మా।

## 7 సహానా-అథవా- శంకరాభరణం. (ఆది)

ఓదీనమందార యోదయాసాగర। నీదారియెది జూపుమా। దయగలదేని( దీనుడైతిని బోవుమా ॥ఓ॥

1 ఎన్నోజన్మములెత్తి యొంటరినై నేను। యెంతో కర్మముఁ

జేసితీ। ఎన్నగరాది। యజ్ఞానమును బాపుమా ॥ఓ॥

2 దుష్టుండై నినుమరచి। దుష్కర్మములు జేసి। దుర్మార్గమున నుంటినీ। దిట్టముగాను। కొట్టిదిద్దుముననున్నా ॥ఓ॥

3 తను మన ధనములు తమసేవకర్పించి। వినుతిసేయుదు సర్వదా। నినుదలంచెద। నీభక్తిదయజేయుమా ॥ఓ॥

4 అంతానీవేయని యద్వైతులనెదరు। అంతానీదనిద్వైతులూ। యనెదరుగాన। నేది సత్యముదెల్పుమా ॥ఓ॥

5 మాయాద్వైతములని లేదుద్వైతమని। వాదులాడుచునుందురూ। యొకడందురు యేదినిజము దెల్పుమా ॥ఓ॥

6 యాగముల్ యోగముల్ భోగముల్ త్యాగముల్। ఆదేశమని యందురూ। బాగగుతీరు। బోధించి దయజూపుమా ॥ఓ॥

7 ఏది తెలియకనున్న నెంతో మేలగుగాని। యాథార్థమెఱుగకున్నా। వ్యర్థమునుమ్ము భోధజేయుము త్వత్తమా ॥ఓ॥

## 8 శహానా. అటతాళం.

ఏమాశ్చర్యమిది? నీమాయ తెలియదు. ఓ మానసరాజమా! ॥ఏ॥

1 విరతిధరించెదు-తరుణుల గూడెదు-గురుతరమగు ధనముకూర్పదలచెదవూ। సరసుల జేరియు-సల్లాపమాడెదు। పరు

లపై కోపముఁ బరగ జూపెదవ్రా॥ ఏ॥

2 సతిసుతులె గతియనుచు మతిలోదలంచెదు। వెతలబొంది తినంచు కుతిల పడియెదవు। గతిలేదుగద యనుచు ధృతి గోలుపోయెదు। అతిమూఢమగుచును నతిచపలవగుదు॥ఏ॥

3 ఉర్విలోతనభక్త హృదయ పీఠంబున-నుజ్వల మగుకాంతితో ॥ సర్వజగములనేలు సార్వభౌమునకు-కూర్మి బిడ్డవు నీకు కొదువలేదుగాదా? ॥ఏ॥

4 సత్యమెఱుంగవు స్వార్థము వదలవు-అత్యంతాగ్రహముచే-అదరివదరెదవ్రా । నిత్యునెఱుంగవు-నిగమముల జాడవు-సత్యార్థమెఱుఁగక వ్యర్థమయ్యెదవ్రా॥ ఏ॥

## 9 శహానా. అటతాళం.

దీనులయెడ ప్రేమ మానసమున నిల్పి చానరోదయ జూడుమా। సాదరముగ చానరోదయ జూడుమా॥ కాని కష్టములకు-లోనై దైవికముగ-కాలుసేతులు బోయి కదలమెదలలేని॥ దీ॥

1 మునలితనముచేత ముదిసి యన్నపానముల సంపాదనమునకూ। పసలేకదేహము-పళులుచూడగలేక। మునలివారై యొరులు బొనసి సేవింపని॥ దీ॥

2 పారవేయగబడిన పసికూనలను కంట బడుటయే తడవు

గనూ। తీరికతో తల్లివలె కష్టపడి పెంచి। తిరుగ నెవ్వరిన ట్టితప్పులబోనీక॥ దీ॥

3 తల్లిదండ్రులుమఱి యెల్లబంధులుబోయి తల్లడపడుబాలుర। వెల్లుగనొడలు తెవుళ్ళలో దవిలి రూ-పెల్లమారిచూడ నెం తయుకొరగాని॥ దీ॥

## 10 బిలహరి.

మంగళంబొసంగవే। మంగళకరమంగళాత్మ॥ మం॥

1 భంగరహితభవవిభంగ తుంగ భూతి శోభితా। సాంగవేద పారంగత సద్బ్రహ్మీంద్ర వందితా॥ మం॥

2 సత్య చారువిమల కీర్తి-అత్యనుపమచక్రవర్తి। నిత్య నిర్వి కారమూర్తి నిగమ రక్షణ ప్రవర్తి॥ మం॥

3 దేవదేవదివ్యభావ। దేవవినుత సత్ప్రభావ-కేవల సచ్చిత్స్వ భావ। కైవల్యానంద విభవ॥ మం॥



# ముఖ్యమగు నిదర్శనము.

మేము " ఫలిత జ్యోతిష ఖండనము " నందొక చోట భవిష్యము చెప్పుటయు, నసంభవమగు మహిమలు చూపుటయు, నిజమగునని వంచించుటకు కొందరు పెద్దమనుష్యులు నయితము బుద్ధిపూర్వకముగ నబద్ధములు చెప్పి, తమ వాదమును సాధింపజూతురని వ్రాసి యున్నందుకు నిదర్శనము జరిగినది.

1922 సం|| నవంబరు 1 తేది హిందూపురం బాలికాపాఠశాల సహోపాధ్యాయుడగు వెంకట రామప్ప అను వారు మాపాఠశాలకు వచ్చిమాపాఠశాల యుపాధ్యాయు లందరి యెదుట బాలమహాత్ముడని పేరుబడిసిన నారాయణదాసు అనుబాలుడు చెప్పిన భవిష్యములు మహిమలు నిజమనియు నేను ప్రత్యక్షముగ నాకన్నులార చూచితినని చెప్పెను. దీనిని పరిశీలించుటకై మేము కొట్నూరు కరణం ధాళప్పగారిని పంపించగా వారు పోయి విచారించి వ్రాసిన జాబును యీక్రింద ప్రకటించినారము.

## జాబు

మహాశయ!నమస్తే!

నేను గుండమల వడేరు బండ గ్రామములకువెళ్లి అంతయువిచారించితిని. నారాయణదాసు అనుపిల్లవాడు నీళ్లమీద

నడచిదిగాని నీటిపైన యరటియాకుమీద కూర్చుండినది గాని భవిష్యములను చెప్పినదిగాని అంతయు నబద్ధము. కొందరు స్వార్థులు యీబాలుని మూలమున కొంత ధన మార్జించి సమారాధనలు జరిపి, తిండి తిన్నది మాత్రము నిజము. పిల్లవాని తో నేను మాటలాడితిని. వాడుపిచ్చి స్వభావము గలవాడు. ఎవరైన ప్రశ్న వేసిన యెడల దానికి బదులు "నీయిల్లు నాశనమగును, నీయాలు ముండమోయును. నీకొంప కాలును" యిత్యాదిగ తిట్టుచున్నాడు. వానికి వేద శాస్త్రములు తెలియవు. విద్యయేరాదు. ఏదో యొక కాక తాళన్యాయమును బట్టుకొని వానిని ప్రత్యక్ష వరుణ దేవుడని వంచకులు పెంచి పెద్దచేసి డబ్బును సంపాదించుచున్నారు. ఇంకేమి విశేషము లేదు.

ధాళీపతి శర్మ.

పాఠకులారా!

వెంకట రామప్పగారుపాధ్యాయులు పెద్దమనుష్యులు అయినను తాము చెప్పినదానిని సిద్ధముచేయుటకు నెంతటి గొప్ప యబద్ధములుచెప్పిరో చూడుడు. మా ప్రధానోపాధ్యాయులు వారి మాటలన్నియు మాయోపాయములని ఖండించిరిగాని ప్రత్యక్షముగ చూచితిమని చెప్పినందున కొందరు నమ్మియుండిరి. ఇట్లే యనేకులు బుద్ధిపూర్వకముగ నబద్ధములు చెప్పుచుందురు.

అ. నా. మూర్తి.

# పండితుల అభిప్రాయములు.

సీ॥ అజ్ఞాన తిమిరంబు నాశాంతములఁ ద్రోయఁ
  కృతుల వ్రాసితిరి మరీచిమహిమ
ఈశరహస్య సార్థకావ్యము భార
  తారుణోదయ బృహత్సారయుతము
హిందు వైవాహిక హితదర్శకంబును
  నరజాలముల జీవనప్రసక్తి
మతమతాంతరపురోహిత మహాసభయును
  దర్శనపరిచయ దర్పణంబు
చవిచూపినంత మాశర్మపుస్తకనిధి
  కంతటికోఁ దృప్తినందునదియె ?
గీ. దినదినము గ్రంథరాజంబు లనుపమ రుచిఁ
జదువుదుము శ్రద్ధతోడను సభ్యులెల్ల
మహిమగలిగి వెల్గొందిన మణులవగిది
నిల్చినారము మాగ్రంథనిలయమందు
మిగతవానినిబంపుము మిత్రవర్య ! (ఇత్యాది) ఎ. బి. శర్మ
ఎలమంచిలి.

నమస్తే మహాశయ !

మెరుపువలె వ్యాపించిన మీగ్రంథరత్నములను రం
గూను నగరమున శ్రీ గౌతమగ్రంథనిలయములో జూచితిని.

అవి నాకు సమీచీనమగు సత్యదృష్టిని ప్రసాదించినవి. ఇందు పది రూప్యముల నోటుంచితిని. గ్రంథముల కొరకు వేచి యున్నాడను.

ఈశ్వరగుప్త,
రంగూన్, బర్మా.

ఆర్యా !

శ్లో॥ నమోమహావైదిక గ్రంథకార్యా
నమస్సదా సత్యవచప్రసార్యా
నమామి హిందూపురవాసితార్యా
నమోస్తునారాయణమూర్తివర్యా॥

శ్లో॥ ఆచినోతిచ శాస్త్రార్థమాచారం స్థాపయత్యపి
స్వయమాచరతేయస్తు ఆచార్యోహిసకథ్యతే॥

యనునట్లు సత్యమును బోధించుచు, సత్యమును విశ్వసించుచు, సత్యము నాచరించుచు, లోకసేవఁ జేయుచున్నారు, గనుక మిమ్ములను ఆంధ్రలోకాచార్యా యని పిలుచుచున్నాను. (ఇత్యాది)

S. G. C. B. శాస్త్రి. కెలమంగలం.

అయ్యా !

1921 సం॥ అక్టోబర్ 12 తేది హిందూపేపరులో శ్రాద్ధమును గురించిన యంశము చదువుచు మామిత్రమండ

లిలో వాదానువాదములు జరిగి యనేక సంశయములు కలిగి యుండగా నొకరు తమగ్రంథ రాజములో శ్రాద్ధనిర్ణయ మును చదివి వినిపించెను. మామిత్రులయొక్క సర్వ సంశ యములు మీగ్రంథమువలన తీరి యానందము కలిగినది. సనాతన సత్యసిద్ధాంతములను చక్కగ నిరూపించుటలో మీ గ్రంథము లద్వితీయములై యున్నవి. (ఇత్యాది)

క. వెంకట సుబ్బారావు,
సోమవారంపేట.

ఇట్లు పండితులును పత్రికాధిపతులును మాగ్రంథ ములు జగత్పూజ్యములని అభిప్రాయముల నిచ్చియున్నారు. కొద్దిప్రతులుకలవు. అన్నియు గొన్నవారికి పోష్టుఖర్చులేదు.

ఆర్య నారాయణమూర్తి.
హిందూపురం
అనంతపురంజిల్లా.

---

# స్వప్న దోష నివారణము.

వీర్యము అథవా మూత్రము వెడలు సమయమున గుదస్థానము కదలుట సంభవించును. లింగము గుదము రెండును కదలుట యొక్కసారి సంభవించును. గుదమును పైకి యీడ్చినయెడల మూత్రపతనము అథవా వీర్యపతన మాగిపోవుచుండును. మన యొక యభ్యాసముచేత గుద స్థానము నూర్ధ్వముగ నిలుపు బలమును గలిగించుకొనిన యెడల వీర్యపాతము నిలిచిపోవును. ఇది యూర్ధ్వరేతస్సు నకు ముఖ్యసాధనము.

1 సిద్ధాసనస్థుండై కూర్చుండి ప్రాణాయామము చేయుచు గుదము నూర్ధ్వముగ పట్టి నిల్పవలయును. రేచక పూరక కుంభక సమయములందు గుదమునుసంకుచితముచేయుచు మూడు ప్రాణాయామములనుండి పదునైదు ప్రాణాయా మములు దనుక అభ్యాసము చేయవలెను. ఆరంభము మొదలు అంతమువరకు గుదా సంకుచితమును మరువ కుండ చేయవలెను.

2 రాత్రి పండుకొనునప్పుడు గుడ్డను చల్లనినీటిలో తడిపి నీటిని పిండి లంగోటిని ధరించి పరుండవలెను.

3 సాధ్యమైనయెడల సరస్వతియాకు సమూలచూర్ణమును అర్ధసేరు పచ్చిపాలు ఆవు అథవా మేకపాలలో కలిపి త్రాగవలెను. సరస్వతియాకు లభింపనిచో వక్షపేలపిండి కలిపి త్రాగవలెను. ఇది సహాయముచేయును. వీర్యము గట్టిపడును.

4 గుదస్థానమందుగాని లింగస్థానమందుగాని పీడ సంభవించినయెడల నేతిలో పసుపుకలిపి రుద్దవలయును.

గుదస్థాన సంకుచిత యుక్తమగు ప్రాణాయామము మూడునెలలు చేసిన చాలును. ఊర్ధ్వరేతస్కుడు కావలెనను యభిలాషగలవారొక సంవత్సరము చేసిన చాలును. తరువాత వీర్యపతనము సంభవింపదు. ప్రాణాయామమందు బాహ్యాభ్యంతరము మొదలగు భేదము లక్కరలేదు. సాధారణముగ రేచక పూరక కుంభకములతో చేసిన చాలును. వాయుధారణవలన నుష్ణముహెచ్చి మలబద్ధముచేసినయెడల పగలు మూడు గంటలు అథవా రెండు గంటల కొకతూరి చల్లనినీటిని త్రాగవలయును. ఆ. నా. మూర్తి.

# కృతజ్ఞతా వందనములు.

నిమ్న లిఖిత మహాశయులు మాకార్యమునకు తోడు పడి ద్రవ్యసహాయము చేసినందులకు మా ధన్యవాదము లర్పించుచున్నారము.

| | |
|---|---|
| శ్రీయుత మాకం శీనయ్యగారు. | హిందూపురం. |
| ,, టి. లక్ష్మయ్య విద్యార్థి. | ,, |
| ,, కె. క్రిష్టయ్యగారు. | ,, |
| ,, కె. విశ్వనాథగుప్తగారు. | ,, |
| ,, దుగ్గిశెట్టి కోటయ్యగారు. కోవూరు. | నెల్లూరుజిల్లా |
| ,, పులకల ఆదినారాయణరెడ్డిగారు. | ,, |
| ,, గుండాల గోపాళయ్యగారు. | ,, |
| ,, సుంకు గోవింద శ్రేష్ఠిగారు. | కదిరి. |
| ,, ఏ. అక్బరల్లి సాహెబుగారు. | కోయిలకుంట్ల. |
| ,, చింతల రఘునాథరెడ్డిగారు. | వాయల్పాడు |
| ,, గోరంట్ల ఆదిమూర్తియ్యగారు. | తిరుమణి. |
| శ్రీమతి వేముల గోవిందమ్మగారు. | ,, |
| ,, వేముల సుబ్బమ్మగారు. | ,, |
| ,, సరాబు రుద్రమ్మగారు. | ,, |
| ,, వేముల ఆదిలక్ష్మమ్మగారు. | ,, |

అ. నా॥ మూర్తి.

# వైదికాంధ్ర గ్రంథములు

| | | |
|---|---|---|
| 1 | ఈశ్వరరహస్య సారము | రు. 1—4—0 |
| 2 | ఫలిత జ్యోతిషఖండనము | 1—0—0 |
| 3 | భారత సూర్యోదయము | 0—10—0 |
| 4 | తత్వజ్ఞానము | 0—10—0 |
| 5 | స్వాత్మనిరీక్షణము | 0—8—0 |
| 6 | మతమతాంతర మహాసభ | 0—10—0 |
| 7 | భక్తిప్రార్థనోపాసనము | 0—2—0 |
| 8 | అగ్నిహోత్రలాభము | 0—8—0 |
| 9 | మనుష్యజీవనము | 0—6—0 |
| 10 | మాంసభక్షణనిషేధము | 0—4—0 |
| 11 | వైవాహికప్రహసనము | 0—4—0 |
| 12 | ప్రశ్నార్ణవము | 0—4—0 |
| 13 | న్యాయదర్శన పరిచయము | 0—10—0 |
| 14 | కలిదర్బారుప్రహసనము | 0—1—0 |
| 15 | మరణదుఃఖ నివారణము | 0—10—0 |

ఆర్య నారాయణమూర్తి,

హిందూపురము, అనంతపురంజిల్లా.

